# ఆంధ్రులు - నృత్యకళ

## నాట్యశాస్త్ర గ్రంథం



రచన :

" నాట్యాచార్య "

సప్పా దుర్గాప్రసాద్

ప్రథమ ముద్రణ : ఆగష్టు, 1992

ప్రతులు : 1000







ముఖచిత్రం, రేఖాచిత్రాలు } "నాట్యాచార్య" పప్పా దుర్గాప్రసాద్

ముద్రణ : బాక్సు టైప్, రాజమండ్రి.

# అంజలి



పార్వతీ తనయుడవై పాపాలు హరించి
శంకర పుత్రుడవై శాపాలు బాపి
విఘ్నరాజువై విఘ్నాలు తొలగించి
తొలివేలుపువై తొలి పూజలంది
సిరిమువ్వల సవ్వడితో లోకాలను
ఆనంద డోలికల ఓలలాడించే
ఓ నృత్త గణపతీ నీకిదే నా అంజలి.



# మున్నుడి

సంగీతంలో సప్తస్వరాలూ ప్రకృతినుంచి స్వీకరింపబడ్డాయి అంటారు. అలాగే నాట్యంలో భావాభివ్యక్తి అవసరమైన ముద్రలు ప్రకృతినుంచే స్వీకరింపబడ్డాయని పెద్దలు అంటారు. అలాకాదు జానపద సంగీతం, జానపద నృత్యం క్రమక్రమంగా సంస్కరణలకు లోనవుతూ ఇప్పటి నాగరికరూపం ధరించాయని మరికొందరి అభిప్రాయం.

సాక్షాత్తుగా నందీశ్వరుడే నాట్యవేద ప్రవర్తకుడని భారతీయుల విశ్వాసం. పరమేశ్వరుడు నటరాజు. సామవేదం సంగీతానికి పుట్టిల్లు. సరస్వతీదేవి వీణాపాణి. ఇది దేవలోక వృత్తాంతం.

రెండవ శ్రేణిలో సరస్వతీ పుత్రుడుగా నారదుడు సంగీతానికి, నటరాజ భృత్యుడుగా నందీశ్వరుడు నాట్యానికీ పట్టుకొమ్మలు. అక్కడినుంచి ఋషిపరంపర ప్రారంభమయ్యింది. ఇవ్వేళ నృత్యసంగీత విద్వాంసులు తమ గురువువరకూ ఉన్న ఈ ఆచార్యపరంపరను నమస్కరిస్తున్నారు. విద్యాస్రవంతి అవిచ్ఛిన్నంగా సాగుతోంది. శ్రీ సప్పా దుర్గాప్రసాద్ గారు అలా నమస్కరిస్తూనే ఆ స్రవంతిలో ఈ కొసను ఏదోకొంత చోటు సంపాదించుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఆంధ్రనాట్యంలో విద్యార్థులకు శిక్షణ ఇస్తూ ఆచార్యకత్వం వహిస్తున్నారు.

అది ఒక పార్శ్వమయితే వీరిలో మరొక పార్శ్వం రచయిత భారతీయ నృత్య సంప్రదాయాలగురించీ అందునా ఆంధ్రనాట్యం గురించి ప్రాయోజకంగానే కాక సైద్ధాంతికంగాకూడా వీరు కొంత కృషిచేసారు. చేస్తున్నారు. తమ కృషినీ పరిశోధననీ గ్రంథ రూపంలో వెలువరించి - సరళమైన భాషలో అవసరమైన బొమ్మలతో ప్రచురించి తనవంతు కర్తవ్యాన్ని బాధ్యతగా నిర్వహిస్తున్నారు. ఇది వ్యయప్రయాసలతోకూడినపని. పుస్తకం చదివితే వీరుపడిన ప్రయాస తెలుస్తుంది. సింగారం చూస్తే వ్యయం అవగతమవుతుంది. ఏమిటో ఈ అభిలాష. తానెరిగింది నలుగురికీ తెలియజెప్పెయ్యాలనుకోవడం - అదొక తమాష ! అందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఇందులో - దేవాలయ శిల్పంలో కనిపించే నాట్య భంగిమలతో ప్రారంభించి వైదిక పురాణయుగాలమీదుగా ప్రయాణించి, చారిత్రిక దశలను సమీక్షించి, సంప్రదాయ భేదాలను అనుశీలించి, ప్రాంతీయతలను పరామర్శించి, వైతుక్తిక ప్రస్థానాలను సూచించి ఆంధ్రుల నృత్యకళను ఈ చిన్నిపుస్తకంలో మరచెంబులో చందమామలాగా చూపించారు. ఇందుకోసం వీరు ఎన్నో గ్రంథాలను తడిమారు. ప్రధానంగా వీరి నాట్యగురువులు శ్రీ నటరాజ రామకృష్ణగారి కృషిని పితార్జితంగా వినియోగించుకున్నారు. అవును. గురువుల కృషికి శిష్యులే కదా సరియైన వారసులు.

ఆంగికం భువనం యస్య - అనే శ్లోకంతో సమస్త విశ్వాన్ని అరచేతిలో ఆమలకంలా చూడటం నేర్పే ఈ కళ మానవుణ్ని విశ్వమానవుణ్ని చేస్తుంది. దృష్టి పరిధుల్ని సృష్టికౌశలకు విస్తరింపజేసే లోజూపు అనుగ్రహిస్తుంది. రసానందలోకాలకు తలుపులు తెరిచి మనస్సులో శాంతినీ కాంతినీ క్రాంతినీ నింపుతుంది ఇంతటి ప్రాముఖ్యం, ఇంతటి ప్రాధాన్యం, ఇంతటి వైవిధ్యం, ఇంతటి వైపుల్యం ఉన్న ఈ కళ అజరామరం. అన్ని యుగాలలోనూ అవసరపడుతూనే ఉంటుంది. మెరుగులు చేపడుతూనే ఉంటుంది. రసికహృదయాలను గిలకొడుతూనే ఉంటుంది. భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం అన్నాడు కాళిదాసు. అది వాస్తవం, శ్రమాపనోదకం ధర్మోపదేశకం అన్నాడు భరతముని ఇది లౌకిక దృష్టి. నృత్యకళా సరస్వతీ సాక్షాత్కారం బ్రహ్మానందాను సంధాయకమై నిర్వాణప్రదమై మోక్ష సాధకమవుతుంది. ఇది పారమార్థిక దృష్టి. అస్తు.

శ్రీ సప్పా దుర్గాప్రసాద్ గారిని అభినందించడంతోపాటు కృతిపతులు మాన్యమిత్రులు శ్రీ మేడపాటి సీతారామరెడ్డి దంపతుల్ని బహుధా కొనియాడుతున్నాను. సంపదను సద్వినియోగంచేసే సన్మార్గులు శ్రీ సీతారామరెడ్డిగారికి బాగా తెలుసు. రాజమహేంద్రిలో ఒక శివాలయం (క్వారీదగ్గర), ద్వారపూడిలో అయ్యప్పగుడి, రహదారుల్లో ప్రయాణీకుల సౌకర్యం కోసం అక్కడక్కడా కట్టించిన శాశ్వతచ్ఛాదనలు. ఇవి వీరి ధార్మికప్రవృత్తికి నాకు తెలిసిన రెండు మూడు ఉదాహరణలు. మంచి మనిషి ముమ్మూర్తులా పెద్దమనిషి. ఈ పుస్తక ప్రచురణకు "చేదోడుగా" నిలిచి మరొక మంచిపని చేసారు.

కృతికర్తృ దంపతులకూ కృతిభర్తృ దంపతులకూ సకుటుంబంగా నాట్యకళాధిదేవత లాస్యతాండవమూర్తి దాంపత్యపరమావధి శ్రీమదుమానటరాజస్వామి సమస్త సన్మంగళాలనూ ఆయురారోగ్యైశ్వర్య భోగభాగ్యాలనూ ప్రసాదించుగాక!

భవదీయుడు,

బేతవోలు రామబ్రహ్మం

సాహిత్య పీఠాధిపతి
తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి.

రాజమండ్రి
22.7.'92

# మీతో ఒక్క నిముషం

పూర్వకాలంనుండి నాట్యశాస్త్రంపై ఎన్నో ఎన్నెన్నో గ్రంథాలు రచింపబడ్డాయి.

ఎందరో మహానుభావులు పరిశోధనలు చేసి అందించిన గ్రంథాలున్నాయి.

మరెందరో నాట్యకళాకోవిదులు రచించిన గ్రంథరాజాలున్నాయి.

ఇంకెందరో నాట్యకళారాధకులు, అభిమానులు అందించిన గ్రంథాలున్నాయి.

ఏమున్నా - ఎన్ని ఉన్నా -

నాట్యమంటే ఏమిటో తెలియనివారికి, నాట్యకళపై ఆశక్తిగలవారికి, నాట్యంలో ఓనమాలు నేర్చుకుంటున్న బాలబాలికల కొరకూ, అతి సులభమయిన భాషలో రచింపబడిన నాట్యశాస్త్ర గ్రంథాలు బహు అరుదు.

సుమారు ఇరువై అయిదు సంవత్సరాలకు పూర్వంవరకూ, మా గురుదేవులయిన "పద్మశ్రీ" నటరాజ రామకృష్ణగారు ఇలాంటి గ్రంథాలు అనేకం రచించారు.

కానీ -

అవి ప్రస్తుతం మాలాంటి నాట్యప్రచారకులకే దొరకని పరిస్థితి. మరి నాట్యంగూర్చి వివరంగా తెలుసుకోవాలనుకొనేవారు తమ ఆశక్తిని అణచుకోవలసిందేనా ?

నేను నాట్యరంగంలో అడుగుపెట్టిన నాటినుండి అనేక నాట్యశాస్త్ర గ్రంథాలు సేకరించాను. కానీ, అవి చదివి అర్థంచేసుకోవడానికి నా జీవితం చాలదనిపించింది.

నాట్యంలో కాస్త పరిచయం ఉన్న నా పరిస్థితే ఇలా ఉంటే ? నాట్యాచార్యులు చెప్పే నృత్యాంశాలు మాత్రమే నేర్చుకొంటున్న విద్యార్థులకు, నాట్యం నేర్చుకొనే అవకాశం లేక కనీసం నాట్యకళగూర్చి, దాని పుట్టుక తదితర వివరాలు తెలియక, తెలుసుకోవాలనే ఆశక్తి గలవారికి ఎలా తెలుస్తుందీ నాట్యకళగూర్చి ?

నాట్యకళగూర్చి తెలుసుకోవాలని చిన్నతనంనుండి నేనుపడిన పాట్లు అనేకం. ఆపాట్లు నా తరువాత తరంవారు పడకూడదు.

అందుకే -

అతి తేలికయిన వాడుకభాషలో 35 వ్యాసాలు, వ్యాసానికి సంబంధించిన రేఖాచిత్రాలతో నా తొలిగ్రంథం ముద్రించాను. దానిపేరు "సిరిమువ్వలు"

దానిలో నాట్యంగూర్చి మాత్రమే తెలియజెప్పటం జరిగింది.

ఇది నా రెండవ నాట్యశాస్త్ర గ్రంథం.

ఇది కూడా అతిసులువయిన వాడుకభాషలోనే రచించాను. ఇందులోకూడా 36 వ్యాసాలు అవిగాక మరికొన్ని ఉపవ్యాసాలు జోడించి వాటికి తగిన బొమ్మలు చిత్రించి మీ ముందుంచాను. నాట్యంగూర్చేగాక మన ఆంధ్రదేశాన్ని పరిపాలించి, నాట్యకళాభివృద్ధికి కృషిచేసిన రాజులగూర్చి కూడా తెలియజేస్తున్నాను.

మంచిని బోధించేది వేదం

మరి వేదాలలో ఐదవది నాట్యవేదం

నాలుగు వేదాల సారం ఈ నాట్యవేదం

నాకు తెలిసిన మంచిని పదిమందికి తెలియచెప్పాలనే సదాశయంతో అందించినదే ఈ "ఆంధ్రుల - నృత్యకళ" ఈ గ్రంథంలోని మంచిని, మంచి విషయాల్ని [illegible]ద యంతో స్వీకరిస్తారనే ఆశతో, [illegible]

కళాంజలి ఘటిస్తూ -
మీ
రచయిత.

# గ్రంథ సమర్పణ



ఎన్నో ఆలయాల నిర్మాణానికి
మరెన్నో ఆలయాల పునర్నిర్మాణానికి
ఎన్నో సంఘాల అభివృద్ధికి
మరెన్నో కుటుంబాల జీవనశృతికి
ఎందరో వ్యక్తుల ఉన్నతికి
మరెందరో మహావ్యక్తుల మహోన్నతికి
నిండుగా కొండంత అండగా నిలిచిన
పుణ్యదంపతులు, నా శ్రేయోభిలాషులు

**శ్రీమతి, శ్రీ**
**మేడపాటి సుశీలాదేవి, సీతారామరెడ్డి**
**దంపతులు**

అందుకే వారికి నిండునూరేళ్ళు
వారికీర్తి వెయ్యేళ్ళు కావాలని ఆకాంక్షిస్తూ
ఈ గ్రంథాన్ని వారికి సమర్పిస్తున్నాను.

— రచయిత

# ఈ గ్రంథం లోపలి పేజీల్లో


1. ప్రకృతి - కళ
2. ఆదిమానవుని నాట్యవిన్యాసం
3. నాట్యకళా సృష్టి
4. భరతముని
5. నాట్యాధి దేవుడు
6. నాట్యమాడిన దేవతలు
7. భారతదేశంలో నాట్యప్రచారం
8. బౌద్ధమత నృత్యాలు
9. ఆంధ్రులు
10. ఆంధ్రుల రాజ్యాలు - కళాభివృద్ధి
11. పల్లవరాజుల శిల్పకళ
12. చాళుక్యుల కళావిశిష్టత
13. కాకతీయుల కళావికాశం
14. రెడ్డిరాజుల కళాతృష్ణ
15. విజయనగర నాట్యవిన్యాసాలు
16. నాయకరాజుల నాట్యపిపాస
17. మధురరాజుల నాట్యాభివృద్ధి
18. నవాబుల నాట్యపోషణ
19. గజపతుల నాట్యవికాశం
20. సంస్థానాధీశుల కళాపోషణ
21. నృత్యరీతులు
22. దేవాలయ ఆరాధనా నృత్యాలు
23. శాస్త్రీయ నృత్యాలు
24 ప్రచార నృత్యాలు
25. జానపద నృత్యాలు
26. ఆటవికుల నృత్యాలు
27. ఆలయ నర్తకి
28. ఆస్థాన నర్తకి
29. అష్టదిక్పాలకుల ఆరాధన
30. శివతాండవం
31. భామాకలాపం
32 కూచిపూడినాట్యం
33. ఆంధ్రనాట్యం
34. పేరిణి శివతాండవం
35. గొల్లకలాపం
36. గురుశిష్యుల అనుబంధం

# ఆంధ్రులు - నృత్యకళ

## నాట్యశాస్త్ర గ్రంథం

# ప్రకృతి — కళ

కళ పరమాత్మనుండి జనించిన ఆరనిజ్యోతి. ప్రకృతి విజృంభణలకు ఒకసారి అణగి యుండినా మరలా ఉన్నత స్థాయికి చేరుకొంటుంది. దైవం వలె కళకు పుట్టుక అంతం లేవు అనేది వాస్తవం.

విశాలమైన ఈ ప్రకృతి ఒక అద్భుతమైన కళాఖండం విశాల వింత విశ్వంలో ఎటు చూచిన మనకు కళలనిలయమై కనబడుతుంది. జలజలపారే సెలయేళ్ళలో మధురమైనసంగీతం వింటూ వాటి అలలలో అందమైన నాట్యం మనం చూడగల్గుతున్నాం, సాయం సమయంలో చెట్ల సందులగుండా వీచేగాలిలో మధురమైన సంగీతం వినవచ్చు, పిల్లగాలికి అల్లల్లాడే ఆకుల, కొమ్మల సుకుమార నాట్యవిలాసం కనువిందుగా ఉంటుంది.

ఉద్ధృతంగా వీచేగాలికి ఊగే వృక్షాలను చూస్తే శివుని ప్రళయ తాండవం కనిపిస్తుంది.

ఈ ప్రకృతిలో దైవం సృష్టించిన కొన్ని విచిత్రాలలో మనకు ప్రత్యక్షంగా కళలు కనబడుతాయి.

ఉదాహరణకు "సోమర" అనే చెట్టుయొక్క ఆకులకు చిన్న పెద్ద రంధ్రాలు ఉంటాయి. గాలి ఆ రంధ్రాలగుండా వీచినపుడు మురళీనాదం వినబడుతుంది. అందుకే ఆ చెట్టును మురళీధ్వని మొక్క అంటారు. ఈ చెట్లు ఈ నాటికీ ఉత్తరప్రదేశ్ అడవులలో ఉన్నాయి. "సోమర" అంటే అరబ్బీ భాషలో మురళి అని అర్థం.

అలాగే మేఘావృతమై ఉన్న ఆకాశంలోని మబ్బులలో విచిత్రంగా వింత వింత దృశ్యాలు చిత్రకారుడు చిత్రించినట్లుగా ఎన్నో కళాఖండాలు, వింత వింత ఆకారాలు మనకు ఆనందానుభూతిని కల్గిస్తాయి అనేది ఏ మాత్రం కళలమీద ఆశక్తి ఉన్న కళాహృదయునికైనా తెలిసిన విషయమే.

పౌర్ణమినాడు రాత్రి సమయంలో సముద్రహోరులో నుండి వినిపించే గంభీరనాదం వింటూ, సముద్ర తరంగాల గాంభీరనాట్యం తిలకించవచ్చు.

ఈ సృష్టిలోని ప్రతి పక్షికూతనుండి వీనుల విందయిన సంగీతశబ్దాలను వినవచ్చును. మేఘ గర్జనలో మృదంగవాయిద్యం, కోయిల కుహూకుహూ రవళిలో మురళీరవం, బెబ్బులి గాండ్రింపులో వీణాఝంకారం మనం వినగలం.

ఇలా ఎన్నో ఎన్నెన్నో ఉదాహరణలు మనకు ఈ ప్రకృతిలోని అణువు అణువునా గోచరిస్తాయి ప్రకృతిమాత ఒడిలో పుట్టిపెరిగే ప్రతిజీవి ఒక అపూర్వ కళాసృష్టే, రసహృదయులకు ప్రకృతి ఒక అందమైన ఆరాధ్య దైవం.

రసహృదయమే ప్రకృతిలోని కళ. ప్రకృతిలోని కళే రసహృదయం.

కేవలం శాస్త్రపరిజ్ఞానమే కాకుండా, ప్రకృతిలో లీనమై ప్రకృతిలోని దాగి ఉన్న కళలను గమనించి తనది చేసుకొన్న కళాకారుడే కళను శాశ్వతంగా, సజీవంగా ఉంచడమే గాకుండా, తనదైన ఒకవిశిష్టతను సాంప్రదాయాన్ని ప్రపంచానికి అందించగలుగుతాడు. తద్వారా అతడు చిరంజీవి కాగల్గుతాడు.

# ఆదిమానవుని నాట్యవిన్యాసం

మానవుడు తొలినుండియూ సంఘజీవి. సుఖదుఃఖ సమయాలలో సన్నిహితులతో గూడి ఏవో ఆటలు ఆడుతూ పాటలు పాడుతూ ఉండటం జరిగింది. ఆ పాటలే నేటి లలిత కళలకు బీజములు.

కష్టం కలిగినప్పుడు ఆక్రోశంతోనూ, సుఖం కలిగినా ఆనందం అనిపించినా తీసే కూనిరాగలే నేటి సంగీతానికి నాంది.

వారు వేసిన పిచ్చిగంతులే నేటి నాట్యానికి మూలం. వారు అరచిన పిచ్చికేకలే నేటి కవిత్వానికి శ్రీకారం. కోరిన కోరిక నెరవేరినప్పుడు తనకు కావలసినది తనదైన వెంటనే చిన్నపిల్లలు ఆనందంగా వేసేగంతులు, అనుకున్నది సాధించిన పెద్దలు వేసేగంతులు ఇవే నేటి మన నాట్యాలన్నింటికి ఆరంభసూచికలు. తొలిమానవుని చిందులే నేడు నాట్య కళాకారుల నృత్తానికి మూలం అనవచ్చును.

నిప్పు సృష్టించడం కొరకు కష్టపడిన, యుద్ధాలు చేసిన ఆనాటి మానవులే ఈ నాటి సంగీత నాట్యాలవంటి కళలు సృష్టించడానికి వాటికొకరూపు నిర్దుష్టమయిన ఒకమార్గం చూపడానికి అనేక కష్ట నష్టాలకు ఓర్చి, వాటినికూర్చి మనకు అందించాడు.

ఆనాడు తాను ఆనందపడ్డాడు.

యీనాడు మనలను ఆనందింప జేస్తున్నాడు.

# నాట్యకళా సృష్టి

నాట్యం బ్రహ్మదేవుని సృష్టి

నాట్యం సృష్టించుటకు మూలకారకులు పార్వతీ పరమేశ్వరులు వారి నాట్యవిన్యాసాలు చూచిన బ్రహ్మాదిదేవతలు ఆనందించి, ఆ ఆనందాన్ని లోకాలన్నింటికీ పంచిపెట్టాలనే ఉద్దేశ్యంతో దేవతల కోరిక మేరకు బ్రహ్మదేవుడు తను సృషించిన నాలుగు వేదాలసారాన్ని ఒకటిగా చేసి పంచమ వేదమయిన నాట్యవేదాన్ని సృష్టించాడు.

ఋగ్వేదం నుండి పాఠ్యం
సామవేదం నుండి గీతం
యజుర్వేదం నుండి అభినయం
అధర్వణవేదం నుండి రసములు

గ్రహించి సర్వప్రజారంజితమయిన నాట్యవేదం సృష్టి జరిగింది. మరలా ఈ నాలుగు వేదాల నుండే ఉపవేదాలుకూడా రచింప బడ్డాయి.

ఋగ్వేదం నుండి ఆయుర్వేదం
సామవేదం నుండి గాంధర్వవేదం
యజుర్వేదం నుండి ధనుర్వేదం
అధర్వణవేదం నుండి శిల్పవేదం

ఇలా ఉపవేదాలు కూడా సృష్టించబడి మొత్తం తొమ్మిది వేదాలు అయ్యాయి. ఈ తొమ్మిది వేదాలు మానవుని విజ్ఞానానికి మనోవికాసానికి తోడ్పడుతున్నాయి. ఇది పురాణాల సారాంశం.

# భరతముని

"నాట్యశాస్త్రం" రచించిన వాడు భరతుడనే ముని. శ్రీరాముని తమ్ముడు భరతుడు. శకుంతలా దుష్యంతుల కుమారుడై భారతదేశానికి మూలపురుషుడయిన భరతుడు. ఇంకా జడ భరతుడు. వీరికి నాట్యానికీ సంబంధంలేదు.

నాలుగు వేదాలసారాన్ని పంచమవేదంగా సృష్టించిన బ్రహ్మదేవుడు భరతుడు అనే ముని పుంగవుని సత్యలోకానికి ఆహ్వానించి, ఆయనకు నాట్యవేదాన్ని ప్రచారనిమిత్తం అందజేశాడు భరతునికి నాట్యం బ్రహ్మదేవుడే స్వయంగా నేర్పించాడు.

అనంతరం నాట్యానికి ఆదిదేవతలయిన శివపార్వతుల ముందు భరతుడు నాట్యం ఆడాడు. ఆనాట్యాన్ని చూసి ఆనందించిన పరమేశ్వరుడు. తన ప్రమధ గణాలలో ఒకడైన తండుని పిలిచి, అతనిచేత భరతునికి తాండవ విన్యాసాలను నేర్పించాడు. తండునిచే నేర్ప బడిన నాట్యం తాండవం అయ్యింది.

భరతుడు తన 104 మంది కుమారులకు నాట్యం నేర్పించాడు. వారే నాట్యాన్ని ప్రచారంచేశారు.

అయితే భరతునియొక్క జీవితకాలం క్రీస్తుపూర్వం 1వ శతాబ్దం అని కొందరు 2వ శతాబ్దం అని కొందరు, కాదు 4వ శతాబ్దం అని కొందరు అంటున్నారు.

ఈ విషయమై ఇంతవరకూ ఖశ్చితమయిన కాలనిర్ణయం జరుగలేదు. ఏది ఏమైనా ప్రాచీనకాలంనుండి యీనాటివరకూ నాట్యానికి ప్రామాణిక గ్రంథం భరతుడు రచించిన "నాట్యశాస్త్రం" మాత్రమే అనేది జగమెరిగిన సత్యం.

# నాట్యాధి దేవుడు

నాట్యానికి ఆదిదేవుడు పరమశివుడు. పరమశివుడినే "నటరాజు"గా నాట్యకళాకారు లందరూ కొలుస్తారు. నటరాజు పూజలేని నాట్యశాల, నాట్యరంగం ఉండదు. అందుకు కారణం అయిన చిన్ని కథను తెలియజేస్తాను.

ఆదిదంపతులయిన శివపార్వతులు తాండవ - లాస్యనర్తన భేదాలలో అగ్రగణ్యు లయ్యారు. ఒకసారి పార్వతీ పరమేశ్వరులు నాట్యంలో నేను గొప్ప అంటే నేను గొప్ప అని వాదించుకున్నారు. ఆ వాదన చిలికి చిలికి గాలివానలా తయారయ్యింది. ఇరువురికి పోటీ పడింది. నాట్యసభ ఏర్పాటు అయింది. దేవతలు, గంధర్వులు, యక్షులు, కిన్నెరులు, కింపురుషులు, ప్రమథగణాలు, మునులు, తుంబుర, నారద, బ్రహ్మ, విష్ణు, సరస్వతి, లక్ష్మి, వినాయక, సుబ్రహ్మణ్యేశ్వర నందీశ్వర ఆదిగాగల ముక్కోటి దేవతలు ఆనాటి నాట్య సభకు విచ్చేశారు. ఆదిదంపతులకు నాట్యపోటీ ప్రారంభం అయింది. ఎన్ని రోజులు గడచిన వారి మనోహరమయిన నాట్యవిన్యాసాలకు ముగింపు లేకుండా ఉంది. ఇద్దరూ ఇద్దరే ఒకరినిమించి ఒకరు నాట్యం ఆడుతున్నారు. ఇరువురిలో గెలుపెవరిదో నిర్ణయించడం కష్టం అయ్యింది. అటువంటి సమయంలో పరమేశ్వరుడు తన కుడికాలును శిరస్సుపై ఉంచుకొని చిత్ర విచిత్ర గతులలో నాట్యం ఆడటం ప్రారంభించాడు. అబల అయిన పార్వతిదేవి నిండు సభలో అలా చేయలేక సిగ్గుపడి నాట్యం ఆపివేసి నిల్చుండిపోయింది. నాట్యంలో గెల్చిన పరమేశ్వరునికి నాట్యకళకు రాజుగా "నటరాజు" అనే బిరుదు ప్రదానం జరిగింది.

శివుడిని గెలిపించిన ఆ భంగిమ పేరు "నికుంభిత" ఈ భంగిమ అంటే శివునికి చాలా ప్రీతి. శివుని ప్రీతికోసం చేసే ఆ నాట్యం "నికుంభితం" ఆనాటి నుండి పరమశివుడు నాట్యాధిదేవునిగా కీర్తింపబడుతున్నాడు. అందుకే కళాకారునికి సమయస్ఫూర్తికావాలి. శాస్త్ర పరిజ్ఞానానికి తోడు సమయస్ఫూర్తి కలిస్తే నర్తకునికి రాణింపు నాట్యానికి గుర్తింపు లభిస్తాయి.

సామాన్యంగా భారతావని అంతటా నటరాజుమూర్తికి ప్రత్యేక స్థానం ఉంది. ప్రతి ఇంటా నటరాజుమూర్తి కొలువుంటాడు. కారణం నటరాజు భంగిమలోని అందమే. అందమే గాకుండా ఆ భంగిమలోని ముద్రలకు అలంకరణలకు కూడా ఒక నిగూఢమయిన అర్థం దాగిఉంది.

# నాట్యమాడిన దేవతలు

నాట్యాధి దేవతలయిన పార్వతీ పరమేశ్వరుల గూర్చి అందరికీ తెలుసు. కానీ కొందరు దేవతలు, మహానుభావులు ఒక్కో సమయంలో ఒక్కో విధంగా నాట్యమాడినట్లుగా తెలుస్తోంది. ముందుగా శ్రీమహావిష్ణువునుగూర్చి తెలుసుకుందాం.

ఈయన క్షీరసాగర మధనం సమయంలో అమృతాన్ని దేవతలూ, దానవులు పంచుకోవడంలో తల ఎత్తిన వివాదాన్ని పరిష్కరించేందుకై జగన్మోహినీ రూపు ధరించి నాట్యం ఆడి, తన నాట్యంతో దానవులను మైమరపింపజేసి దేవతలకు మాత్రమే అమృతం అందించాడు. అలాగే మరోసారి మోహినిగా భస్మాసురుడనే రాక్షసుడిని తన నాట్యంతో మైమరపించి, అతనికి నాట్యం నేర్పి, ఆనాట్య విద్యనే ఆయుధంగా చేసి భస్మాసురుడిని అంతమొందించి జగత్కళ్యాణ కారకుడయ్యాడు.

ఇంకా దత్తిలుడు, కోహలుడు, యజ్ఞవల్క్యుడు, నారదుడు, హనుమంతుడు, వినాయకుడు, సుబ్రహ్మణ్యస్వామి నాట్యం ఆడారు. వినాయకుని నృత్య భంగిమలు మన భారతావనిలో బాగా ప్రచారంలో ఉన్నాయి. ఇంకా రంభా, ఊర్వశి, మేనక, తిలోత్తమ, వంటి అప్సరసలు తమ నృత్యవిన్యాసాలతో ఇంద్రుని సింహాసనాన్ని ఎన్నోసార్లు కాపాడినారు. రాక్షసేంద్రుడు, మహాభక్తుడయిన రావణబ్రహ్మ ప్రతినిత్యం నృత్యపూజ చేసేవాడు. ఈయన బ్రహ్మవంశంలో జన్మించిన సకల శాస్త్ర పండితుడు.

శ్రీకృష్ణుడు రెండు సమయాలలో మాత్రం నాట్యం చేసినట్లుగా మనకు పురాణాలు తెల్పుతున్నాయి. కాళీయుని గర్వమణచడానికి అతని పడగలపై బాలకృష్ణునిగా తాండవమాడి వ్రేపల్లెవాసుల కనులవిందు జేశాడు. అదే కృష్ణతాండవంగా ప్రచారం పొందింది.

గోపకాంతలతో నాట్యమాడాడు శ్రీకృష్ణుడు. శృంగార రస ప్రదానమయిన నాట్యాలు అన్నీ శ్రీకృష్ణుడూ రాధలపై రచింపబడి నర్తింపబడినవే కావడం అవి ఈనాడూ ప్రచారం పొంది జనరంజకాలుగా ఉండటం అందరూ ఎరిగిన విషయమే. అర్జునుడు ఊర్వశి నుండి నాట్యం అభ్యసించి, అజ్ఞాతవాస సమయంలో బృహన్నలగా మత్స్యదేశ రాజయిన విరాటుని కొలువులోని స్త్రీలకూ, ఉత్తరకు నాట్యం నేర్పాడు.

ఉషా అనిరుద్ధుల చరిత్ర "ఉషాపరిణయము"గా ప్రచారంలో ఉంది. ఉష పార్వతి దేవి వద్ద నాట్యం అభ్యసించి. ద్వారకలోని స్త్రీలకు నాట్యం నేర్పింది.

ఇలా నృత్యం ప్రచారం జరుగుతున్న సమయంలోనే అనేక వాయిద్యాలు పుట్టాయి. ఒక్కో వాద్య పుట్టుకకు ఒక్కో కథ ప్రచారంలో ఉంది.

ఇలా ఎందరో దేవతలు నృత్యం ఆడారు. నేర్పారు. తరించారు. వారి చరిత్రలే నేడు మనం నృత్య నాటకాలుగా, నాట్యాలుగా నర్తిస్తున్నాం. నాట్యకళాకారులు నర్తిస్తుంటే చూసి ఆనందిస్తున్నాం.

# భారతదేశంలో నాట్యప్రచారం

భారతదేశం పురాణ ఇతిహాసాలకు నిలయం. వేదాలకు, ఉపనిషత్తులకు జన్మభూమి మన భారతావని భారతదేశాన్ని పాలించిన రాజులలో విక్రమార్కుడు, హర్షుడు, అశోకుడు మొదలగు రాజేంద్రుల కాలంలో నాట్యం విరివిగా ప్రచారంలో ఉంది అనడానికి అనేక ఆధారాలున్నాయి.

ఆంధ్రదేశంలో శాతవాహనుల కాలంనాడు వివిధ నృత్యసాంప్రదాయాలు అభివృద్ధి చెందాయి. అనేక నాట్యశాస్త్ర గ్రంథాలు రచింపబడ్డాయి. కానీ అవి మనకు లభించలేదు. అవి లభించకపోయినా ఆనాటి శిల్ప సంపదలలోని నాట్యవిన్యాసాలను చూస్తే మనకు ఆనాటి నాట్య కళాభివృద్ధి అవగతం అవుతుంది.

హాలుడు రచించిన "గాధాశప్తశతి"లోని ఏడువందల పద్యాలు 2 వేల సంవత్సరాల నాటి మన సంస్కృతిని తెలుసుకొనేందుకు ఉపయోగపడతాయి.

ఈ కాలంలో అనూలక్ష్మి, రేవా అనేవారిద్దరూ హాలుని ఆస్థానంలో కవిత్వం చెప్పినట్లుగా గాధాశప్తశతిలో వివరించబడి ఉంది. శాతవాహనుల కాలంలో నాట్యం బాగా ప్రచారంలో ఉందనడానికి నేటి బౌద్ధారామాలే సాక్ష్యం. అందులోని శిల్పసంపద, నాట్యభంగిమలు. చేతులు కాళ్ళు విరిగిన నాట్యకత్తెల శిల్పాల అవశేషాలు ఇవన్నీ ఆనాటి నాట్యకళా వైభవాన్ని తెలియజేస్తున్నాయి. శాతవాహనుల కాలంలో బౌద్ధమత వ్యాప్తి జరిగింది.

# భౌద్ధమత నృత్యాలు

భారత దేశంలో భౌద్ధమతం ప్రచారంలో ఉన్న రోజులలో కొందరు తల్లిదండ్రులు తమ బాలికలను సౌందర్యవంతంగా అలంకరించి భౌద్ధాలయాలకు తీసికొని వెళ్ళి ఆ దేవునికి అంకితంగా ఆ బాలికను అప్పగించేవారు. ఆ బాలికలు సంగీత, నృత్యసాంప్రదాయాలలో శిక్షణ పొంది ఆలయంలో నృత్యం చేసేవారు. ఇది ఒక రకమయిన మ్రొక్కుబడి కార్యం, ఆనాటి ఆచారం. అంతేగాక రుచికరమయిన పిండివంటలు దేవునికి నైవేద్యంగా పెట్టి నృత్యం చేస్తే, ఆ నృత్యం జరుగుతున్నంతసేపు దేవుడు ఆ పిండివంటలు ఆరగిస్తాడనే నమ్మకం ఆ రోజులలో ఉండేది. భౌద్ధులలో ఇది ఒక రకమయిన దేవదాసీ సాంప్రదాయం.

భౌద్ధమతంలోని నృత్యకళ గూర్చి కొన్ని వివరాలు తెలిసినా, ఆనాడు ప్రచారంలో ఉన్న సాంప్రదాయ నృత్యాలను గూర్చి మనకు తెలియడంలేదు. భౌద్ధశిల్పంజూసి పరిశోధన చేస్తే, భౌద్ధమతం ప్రచారంలో ఉన్న ప్రాంతాలు దేశాలు పర్యటించి వివరాలు సేకరించి, నృత్యాలగూర్చి తెలుసుకొని గ్రంధాలు తిరగేస్తే కొంతవరకూ ఆనాటి నృత్యాలు అప్పటి వాతావరణం, ఆచార వ్యవహారాలు, తెలుసుకొనవచ్చునని నా అభిప్రాయం.

# ఆంధ్రులు

మనజాతి ఆంధ్రజాతి
మనం ఆంధ్రులం
మన నాట్యం ఆంధ్రుల నాట్యం

మన జాతి చరిత్రను కశ్చితంగా పలానా సంవత్సరంలో ప్రారంభం అయిందని చెప్పడం కష్టం, ఏజాతి చరిత్ర అయినా పలానా సంవత్సరం నుండి ప్రారంభం అయిందని నిర్దుష్టంగా చెప్పడం అసాధ్యం, కానీ జాతియొక్క చరిత్రను కొన్ని ప్రాచీన గ్రంథాల ఆధారంగా అంచనా వేయవచ్చును. అలాగే మన ఆంధ్రుల చరిత్రను అంచనా వేశారెందరో మహాను భావులు. రామాయణ, భాగవత, భారత గ్రంథాలలో ఆంధ్రుల ప్రసక్తి ఉంది.

రామాయణం కాలంలో ఆంధ్రులు :- విశ్వామిత్రమహర్షి నరమేధం నివారించి యజ్ఞపశువు అయిన శునస్సేపుని విడిపించి అతనిని దత్తపుత్రునిగా స్వీకరించాడు. అందుకు ఇష్టపడని విశ్వామిత్ర సంతతి అతని శాపం మూలంగా తూర్పు దక్షిణ దిశలుగా తరలిపోయారు. వారే ఆంధ్రులని తెలుస్తోంది. ఇది త్రేతాయుగంలో జరిగిన సంఘటన.

భాగవతంలో ఆంధ్రులు :- శ్రీకృష్ణుని మధురానగరం ఆహ్వానించాడు కంసుడు. కృష్ణ, బలరాములిరువురు మధుర వచ్చిన సమయంలో కంసునిచే ప్రేరేపితుడయిన కరూశ దేశానికి రాజైన చాణురుడు అనే మల్లయోధుడు శ్రీకృష్ణునితో యుద్ధంచేసి చనిపోయాడు. ఆ చాణురుడు ఆంధ్రుడని తెలుస్తోంది. వింధ్యపర్వతాలకు ఉత్తరాన యమునా నదీతీరంలో ఈ కరూరదేశం ఉండేది. ఇది ద్వాపరయుగం నాటిమాట.

మహాభారతంలో ఆంధ్రులు :- కురు పాండవ సంగ్రామంలో ఆంధ్రులు కౌరవుల పక్షాన పోరాడారు. ధర్మజుని రాజసూయయాగం సమయంలో సహదేవుడు ఆంధ్రులను జయించినట్లుగా తెలియజేస్తుంది మహాభారతం. ఇది ద్వాపర, కలియుగాలు సంధికాలంలో జరిగిన యదార్థం.

క్రీ॥ పూ॥ 1000 సం॥ ప్రాంతంలో రచింపబడిన "ఐతరేయ బ్రాహ్మణం"లో ఆంధ్రుల ప్రశక్తి ఉంది. అంటే అప్పటికే ఆంధ్రులు స్థిరపడి రాజ్యస్థాపన చేసి రాజ్యాలు పాలిస్తున్నారన్నది వాస్తవమేగదా.

# ఆంధ్రుల రాజ్యాలు – కళాభివృద్ధి

మౌర్యవంశజులు క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్ధికాలంలో పాటలీపుత్రం రాజధానిగా రాజ్యాన్ని పాలించారు. ఆ కాలంలో ఆంధ్రులు దక్షిణాదిని రాజ్యంస్థాపించి పరిపాలించినట్లు తెలుస్తోంది. ఆనాటినుండి శాతవాహనులు, ఇక్ష్వాకులు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. వీరి కాలంలో కళలకంటే సాహిత్యానికీ, శిల్పానికీ, రాజ్య సుస్థిరతకూ ఎక్కువ ప్రాధాన్యం కల్గించారని తెలుస్తోంది. అనంతరం వెలసిన విష్ణుకుండినుల కాలంలో శ్రీశైలం, కోటప్పకొండ ఉచ్ఛస్థితిలో వెలుగొందాయి. శ్రీశైలం ఆనాటినుండి ఈనాటివరకూ నాట్యకళలకు భాండాగారం. యజ్ఞాలు, యాగాలు ఎక్కువగా జరిగేవి. విద్యాధికులయిన విప్రులకు సన్మానాలు జరిపి వారిని పోషించిన ఘనత వీరికే దక్కింది. వీరి హయాంలో అనేక ఆలయాలు శిల్పకళా సౌంధర్యంతో వెల్లివిరిశాయి. పాలూరులోని విష్ణుగ్రహస్వామి వేంగిలోని చిత్రరధస్వామి వీరి కళాపిపాసకు ఉదాహరణలు. రాతిగుట్టలు, కొండలు చెక్కించి సుందర హిందూ దేవాలయాలుగా తీర్చిదిద్దారు. ఉండవల్లి గుహలలోని శ్రీ అనంతశయనుని భారీ విగ్రహం వీరి హయాంలోని శిల్పకళా చాతుర్యానికి నిదర్శనం. వీరి అనంతరం పల్లవులు రాజ్యపాలన చేశారు.

# పల్లవరాజుల శిల్పకళ

పల్లవరాజుల కాలంలో శిల్పం, నృత్యం బాగా అభివృద్ధి చెందాయి. వీరిలో మొదటి పల్లవ మహేంద్రవర్మ రుద్రాచార్యుని వద్ద సంగీతం, నాట్యం అభ్యసించి ఆ అభ్యాసం వృధా కాకుండా కుడిమియామలై అనుచోట సంగీత గ్రంథమును శిలాక్షరములుగా చెక్కించాడు. ఇలా చేసిన కీర్తి రాజులలో మొదటిగా ఈయనకే దక్కింది. ఈ పల్లవరాజుల హయాంలోనే మహాబలిపురం నిర్మాణం జరిగింది. ఈనాటికీ మహాబలిపురంలోని శిల్పాలు, ఏక శిలా రథాలు, ఆ శిల్పాలలోని నాట్యభంగిమలు భారతీయ శిల్పకళలకు తలమానికంగా నిలిచాయి. పెక్కు దేవాలయాలు నిర్మించిన వీరి దశలోనే కాంచీపురంలోని కైలాసనాథ దేవాలయం మహాబలిపురంలోని సముద్రతీరాన విష్ణుదేవాలయాలు మిగిలిన శివాలయాది ప్రాకారాల నిర్మాణం జరిగింది. నాట్యకళ, శిల్పకళ, చిత్రలేఖనం యందు అభిరుచి కల్గియుండుటయేకాక కవులను, కళాకారులనూ, నాట్యకళా కోవిదులను తమ ఆస్థానంలో ఉంచుకొని కళలను పోషించారు. కావ్యధర్మ, అవంతిసుందరికథ, మున్నగునవి రచించిన దండికవి వీరి ఆస్థానంలోని వాడవటం వీరి కళాపోషణలకు ఒక నిదర్శనం. అశ్వమేధయాగం చేసిన కీర్తి వీరికే దక్కింది.

పల్లవరాజుల అనంతరం చోళరాజ్యముదయించింది.

# చాళుక్యుల కళావిశిష్టత

చాళుక్యులు బహు సమర్థత కల్గిన రాజులు. శైవమతం వీరి కాలంలో బాగా వ్యాప్తి చెందింది. చాళుక్యుల ఆస్థానంలో అనేకమంది సంగీత. నృత్య కళాకారులు ఉండేవారు. సంగీత విద్యావిశారద చెల్లవ వీరి ఆస్థానంలోని కళాకారిణి. నారాయణ బట్టు అనే మంత్రి సామ్రాజ్యవ్యవహారాలు చూస్తూ మహభారత రచనలో నన్నయకు సహాయపడ్డాడు. ఇతడు ఆదికవి నన్నయకు సహాధ్యాయుడని తెలుస్తోంది. ఆంధ్రలో మహాభారతం రచించి నన్నయ్య ఆదికవి అయితే అతనిచేత భారతం రచింపజేసిన కీర్తి చాళుక్యుల రాజు రాజరాజ నరేంద్రునికి దక్కింది. రాజమహేంద్రవరానికి చరిత్రపుటలలో విశిష్టస్థానం కల్గించిన కీర్తి చాళుక్యులదే. వీరి హయాంలోనే ద్రాక్షారామ భీమేశ్వర ఆలయం నిర్మింపబడింది. పాకనాటి తెలుగు చోళులలో ఒకడయిన నన్నెచోడన్నపతి కుమార సంభవకర్త అయినాడు. ఈ కాలంలో దేవాలయ ప్రతిష్టలు అధికంగా జరిగాయి. దేవాలయాలకు దానధర్మాలు చేసి. దేవాలయాలలో వాద్య. నర్తనపూజల ఏర్పాట్లు జరిగాయి. సంగీతం, నృత్యం. శిల్పం, చిత్రలేఖనం, సాహిత్య నిలయాలుగా దేవాలయాలను తీర్చిదిద్దిన ఖ్యాతి వీరికే దక్కింది. వీరి కాలంలో శైవ, వైష్ణవ మతాలు సరిసమానంగా అభివృద్ధి చెందటమేగాక, శివుని ప్రీతికరమైన తాండవ విన్యాసాలు, విష్ణుప్రీతి అయిన లాస్యనర్తనాలు కొత్త కొత్త కాంతులతో వెలుగులు విరజిమ్మాయి.

# కాకతీయుల కళావికాసం

ఆంధ్రదేశంలో కాకతీయ సామ్రాజ్యం వర్ధిల్లిన కాలం ఒక మహోజ్వల ఘట్టం. కాకతీయులు పెక్కు విషమ పరిస్థితులు తట్టుకొని తెలుగునేల నలుచెరగులా వశపరచుకొని విశాల ఆంధ్ర సామ్రాజ్యం స్థాపించిన మహనీయులు. తెలుగు వారికి ఒక విశిష్టత, వ్యక్తిత్వం సమకూర్చిన ఉదాత్తచరితులు కాకతీయమహారాజులు. ఉత్తరదేశ మహ్మదీయుల దండ యాత్రలు నిలువరించిన వీరులు కాకతీయులు. వీరి కాలంలోని రుద్రదేవమహరాజు పరిపాలించు చుండగా వేయిస్థంభాలగుడి, ఇంకా అనేక శివాలయాలు నిర్మితం అయ్యాయి. ఇతని ఆస్థానంలో అచితేంద్రవరుడనే ఒక సంస్కృత కవి ఉండేవాడు. ఈ కవి వసంతుడే వేయి స్థంభాల గుడిలోని శాశనములను చక్కని సంస్కృత శ్లోకములతో రచించాడు. తరువాత గణపతి దేవుని కాలంలో ప్రఖ్యాతమయిన పాఖాల, లక్కవరం, ఘనపురం చెఱువులు త్రవ్వించి ఆ తటాకాల ఒడ్డున రామప్పగుడి, ఘనపురం దేవాలయం వంటి దివ్యమయిన కళానిర్మాణములు రూపొందించారు. రామప్ప గుడి ఆంధ్రుల శిల్పకళా చాతుర్యానికి, నాట్య కళకు తలమానికం. చెక్కు చెదరని రామప్ప దేవాలయంలోని నాట్య భంగిమల శిల్పాలు నాటి నాట్యకళా విన్యాసాలకు ప్రత్యక్ష సాక్ష్యాలు. అంతేగాకుండా ఒక ఆలయానికి శిల్పంతో అలంకరించిన రామప్ప అనే శిల్పాచార్యుని పేరుమీదనే గుడి నిర్మింపబడటం ఆ ఆలయానికి అందులోని దేవునికంటే శిల్పి పేరుమీదనే ఇన్ని దశాబ్ధాలయినా కూడా రామప్ప గుడిగానే వ్యవహరింపబడేలా ఒక శిల్పికీర్తిని నిలబెట్టిన ఖ్యాతి కాకతీయులకు మాత్రమే దక్కింది. యావత్ ప్రపంచంలోనే ఒక శిల్పకళాకారునికి ఇంతటి గౌరవం దక్కేలా చేసిన ఘనత కాకతీయుల పుణ్యాన ఆంధ్రులకే దక్కింది అంటే అతిశయోక్తికాదు. పలువురు కవి, పండిత, గాయక, శిల్ప, నాట్యకళాకారులను పోషించారు. కాకతీయుల రాజ్య చరిత్రలో గణపతి దేవుని కాలం స్వర్ణయుగం అనవచ్చును.

తరువాత గణపతి దేవుని కుమార్తె రుద్రమాదేవి కాకతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించింది. ఈమే స్వయంభు ఆలయాన్ని నిర్మింపజేసింది. ఆంధ్రదేశమంతటి పెద్ద సామ్రాజ్యాన్ని ఏకచత్రాధి పత్యంగా పరిపాలించిన ఘనత రుద్రమాదేవిదే. ఎందరో శత్రు వులకు గుండెదడ పుట్టించి, ఉత్తరాది మహ్మదీయ సేనలను గడ గడ లాడించి ఆంధ్ర దేశాన్ని సుభిక్షంగా పాలించిన వీరనారి రాణిరుద్రమదేవి.

తరువాత ప్రతాపరుద్రుడు పరిపాలించాడు. అతని హయాంలో రాజ్యం ఎన్నో వత్తిడులకులోనయింది. అయినా సమర్ధవంతంగా పరిపాలించినాడు ప్రతాపరుద్రుడు. ఎంత సమర్థుడయినా శత్రుబలం ఎక్కువకావడంతో కాకతీయ సామ్రాజ్యం అంతమయ్యిందనడానికి కారకుడు ప్రతాపరుద్రుడే. ఈ కాకతీయ యుగంలోనే ద్విపద రంగనాధ రామాయణం పాల్కూరి సోమనాధుని బసవపురాణం, పండితారాధ్య చరిత్ర క్రీడాభిరామం, వృషాధిపశతకం, భాస్కర రామాయణం, నీతిశాస్త్ర ముక్తావళి, సుమతీశతకం, పండితారాధ్యుని శివతత్వం, నన్నెచోడుని కుమార సంభవం, మార్కండేయ పురాణం వంటి అద్భుత కావ్యాలు రచింపబడ్డాయి. అంతేగాక ప్రతాపరుద్రుడు స్వయంగా "నీతిశాస్త్రం" అనే కావ్యం వ్రాశాడు. దురదృష్టవశాత్తు అది మనకు లభ్యపడలేదు.

ప్రతాపరుద్రుని ఆస్థానంలో విశ్వనాధుడు, విద్యానాధుడు, మల్లిఖార్జునుడు అనే సంస్కృత పండితులుండేవారు. వీరిలో విశ్వనాధకవి "ప్రతాపరుద్రీయం" అనే కావ్యం రాసాడు. ఈ కావ్యరత్నాలన్నీ ఒక్కఎత్తు. తిక్కన సోమయాజి పూర్తిచేసిన మహాభారతం ఒకఎత్తు. ఈ కాకతీయుల కాలంలోనే శైవవాఙ్మయం శైవనృత్య సాంప్రదాయం గణనీయంగా వెలుగొందాయి. ప్రతాపరుద్రుని ఆస్థానంలో మాచలదేవి అనే ఆస్థాన నర్తకిమణి ఉండేది. నాట్యంలో ఆమెకు ఆమెసాటి, ఆమె తన వంశ చరిత్రనే ఒక యక్షగానంగా రూపొందించి ఆ యక్షగానానికి నాట్యం కూర్చి, నర్తింపజేసి ఆనందించిన ఘనురాలు. కాకతీయుల గణపతిదేవుని గజసైన్యాధ్యక్షుడయిన జాయపసేనాని రచించిన "నృత్తరత్నావళి" "సంగీతరత్నావళి" అనే గ్రంధాలలో నృత్తరత్నావళి ఒక్కటే లభ్యం అయ్యింది. ఆనాటి, అంతకంటే ముందుతరం నాటి నాట్యశాస్త్రం గూర్చి వివరించబడిన అద్భుత నాట్యశాస్త్ర గ్రంధం "నృత్తరర్నావళి"

వీరి హయాంలోనే ప్రపంచప్రఖ్యాతి గాంచిన పురుషుల వీరనర్తనం "పేరిణిశివతాండవం" రూపొందించబడి తెలుగుయువకులచే నర్తింపబడింది. ప్రతి ఆలయంలో రోజుకు మూడు పర్యాయాలు ఈ తాండవ నర్తనం సాగేది. అంతేగాకుండా యుద్ధప్రేరణకోసం, ప్రజల ఆహ్లాదంకోసం కూడా ఈ తాండవం ప్రదర్శితమయ్యేది. ఆంధ్రదేశంలోనే కాక భారత దేశంలోని వివిధ రాజ్యాలలో ఈ వీర నాట్యం తెలుగు యువకులు ప్రదర్శించినట్లుగా అనేక ఆధారాలున్నాయి.

కాకతీయుల శిల్పం, దేవాలయం భారతదేశ చరిత్రలోనే ఒక విశిష్టితను సంతరించుకొంది. వీరశైవ సాంప్రదాయం, ఉద్ధృతవర్తన విన్యాసం, వీరనాట్యం విశేషంగా ప్రదర్శింప

బడి ఆ ఆవేశంలోనే ఎందరో యువకుల ప్రాణాలను అర్పణగావించుకొనేలా చేసింది. కాకతీయుల అనంతరం ఈ వీరనాట్యం కాలగర్భంలో కలిసిపోయింది. కాకతీయుల కాలంలోనే శ్రీశైలంలో అరువది నాట్యకూటములుండేవట. ఒక్క శ్రీశైలంలోనే అవవది నాట్యకూటములుంటే మొత్తం రాజ్యంలో ఎన్ని నాట్యకూటములు ఉండేవో, ఎన్ని నాట్యశాల లుండేవో, నాట్యం ఎంత ప్రచారంలో ఉండేదో మనం ఊహించవచ్చును.

వీరి శిల్పశైలిలో రూపొందిన స్వయంభూ ఆలయం, పద్మాక్షి ఆలయం, సూర్యాలయం, వేయిస్తంభాలగుడి, రామప్ప దేవాలయం చూస్తే ఆనాటి నాట్యకళాకారుల, నాట్యకళాకారిణుల నాట్యవిన్యాసాలు విదితమవుతాయి.

వీరశైవం విరివిగా ప్రచారం జరిగిన ఈ రోజులలో ఊరికొక నర్తకుడు ఊరికోసం నాట్యం చేసేవాడు, ప్రతిపల్లెలోనూ, ప్రభుత్వం, ప్రజలు ఆ నర్తకుని పోషించేవారు. ఆ ఊరికి వచ్చే ఆపద సమయాలలో ఆ నర్తకుడు శివుని ముందు వీరనాట్యం చేసి తన ఖడ్గంతో తానే శిరస్సు ఖండించుకొని ఆత్మార్పణం గావించుకొనేవాడు, ఇది ఒక మొక్కుబడి వంటి ఆచారం. ఈనాటికీ ఆంధ్రదేశంలోని ఈ వీరుల శిల్పాలు మనకు అక్కడక్కడ కన్పిస్తాయి. అంతేగాకుండా ఆవేశంతో నర్తించే నర్తకుడు ఒళ్ళు తెలియని ఆవేశంతో కత్తితో పొడుచుకొని కూడా ఆత్మార్పణ చేసుకొనేవాడు.

కాకతీయుల అనంతరం వీరశైవం అంతరించింది.

# రెడ్డిరాజుల కళాతృష్ణ

కాకతీయుల అనంతరం ముస్లీములు పాలించారు. వీరి హయాంలో అనేక హిందూ దేవాలయాలు మసీదులుగా మార్చబడ్డాయి. మరికొన్ని కూల్చబడ్డాయి. 1324 సం॥లో రాజమహేంద్రవరంలోని వేణుగోపాలస్వామి ఆలయం మసీదుగా మార్చబడింది. అనంతరం రెడ్డిరాజుల శకం ప్రారంభం అయ్యింది.

కొండవీటి రెడ్డిరాజులు సంగీతం, సాహిత్యం, నాట్యం అభివృద్ధికి తమ జీవితాలు అర్పించారు. వారిలో కర్పూర వసంతరాయనిగా బిరుదు వహించిన కొమరగిరి రెడ్డి తనకు భాసటగా నిలిచి విజయవిహారం చేసిన కాటయవేమునికి రాజమహేంద్రవరం అయన శౌర్యానికి, పరాక్రమానికి మెచ్చి బహుమతిగా ఇచ్చాడు. వీరి కాలంలోనే శ్రీనాధుడు జీవించాడు. ఈయన హరవిలాసం కాశీఖండం, భీమఖండం, శృంగారనైషధం ఇంకా అనేక గ్రంధరాజాలును రాజమహేంద్రవరంలో రెడ్డిరాజుల కాలంలో వ్రాసినవే గావటం విశేషం. ఆ సమయంలోనే హరిభక్తుడయిన బమ్మెరపోతన ఆడంబరాలులేని సామాన్య జీవితం గడుపుతూనే భాగవతం వ్రాశాడు. కవిత్రయంలో ఒక్కడయిన యఱ్ఱాప్రగడ రెడ్డిరాజుల కాలంలోనే జీవించాడు.

కొమరగిరి రెడ్డి ఆస్థానంలో లకుమాదేవి అనే నర్తకి ఆస్థాన నర్తకిగా ఉంటూ కొమరగిరి రెడ్డికి స్ఫూర్తినిచ్చి "వసంతరాజీవం" అనే నాట్యశాస్త్ర గ్రంధాన్ని రచింపజేసింది. ఆమె నాట్యమాడుతుంటే ఆ నాట్యంచూస్తూ, ఆమె చెప్పే నాట్యకళా వివరణలు వింటూ కొమరగిరి రెడ్డి ఈ గ్రంధాన్ని రచించినట్లుగా తెలుస్తోంది. కానీ మన దురదృష్టవశాత్తూ ఈనాటికీ ఆ గ్రంధం లభించలేదు. మహావీరుడు కొమరగిరి రెడ్డి బావ అయిన కాటయవేముడు గూడా కాళిదాసు వ్రాసిన నాటకాలపై విమర్శవ్రాశాడు. ఇంకా అనేక గ్రంధాలు రచించాడు.

రెడ్డిరాజుల కాలంలో కూడా నాట్యం బాగా అభివృద్ధి చెందింది. వీరి హయాంలో వీరారాధన. వీరపూజ జరిగింది. వీరముష్ఠి, మైలారు, వీరభటులనే వీరనాట్యం ఆడె నర్తకులు నాట్యంచేస్తూ ఆ ఆవేశంలో స్వామివారి రధచక్రాలక్రింద నలిగి చనిపోవడం, ఆత్మను స్వామిలో ఐఖ్యం చేయడం మోక్షదాయకంగా భావించేవారు.

ఈ రెడ్డిరాజుల హయాంలో వసంతోత్సవం బాగా నిర్వహింపబడింది. ఆ రాజ్యంలో వసంతోత్సవం పెద్దపండుగ. ప్రతియేటా ఈ వసంతోత్సవం సమయంలో అనేక విద్యలకూ, కళలకు పోటీలు నిర్వహించి గెలిచిన వారికి ఓడిన వారికీ గూడా బహుమానాలు, పండితులకు సత్కారాలు అందించిన ఘనత కొమరగిరి రెడ్డికేదక్కింది. అందుకే కొమరగిరి రెడ్డికి "కర్పూర వసంతరాయలు" అనే బిరుదు ఉండేది. ఈ కాలంలోనే ఉత్తర భారతావనిలోని నాట్య, సంగీత శాస్త్రాలలో విదేశీపోకటలు మిశితమయ్యాయి. అందుకు కారణం ఉత్తర హిందుస్థానం అంతా ఇంచుమించుగా ముస్లీముల రాజ్యాలు స్థిరపడటమే. రెడ్డిరాజుల అనంతరం విజయనగర సామ్రాజ్యం ఆవిర్భవించింది.

# విజయనగర నాట్య విన్యాసాలు

కాకతీయుల అనంతరం దక్షిణ భారతావనిలో అత్యంత ప్రతిభావంతంగా రాజ్య పాలన గావించిన రాజులు విజయనగర పాలకులు.

రామాయణ కాలంలోని కిష్కింద నగరముండే చోటునే హంపి నిర్మాణం జరిగింది. ఈ సామ్రాజ్య స్థాపనకు విద్యారణ్యుడనే పండితుడు ముఖ్యకారకుడు. సుమారు 300 సంవత్సరాలు రాజ్యం పాలించిన ఈ విజయనగర రాజులలో ప్రారంభకులయిన హరిహర బుక్కరాయలు వీరిద్దరూ ప్రతాపరుద్రుని బంధువర్గంలోని వారే. ఈ తెలుగు వీరులు ప్రతాప రుద్ర మహారాజువద్ద సైనికాధికారులుగా ఉండేవారు. కాకతీయ రాజ్యపతనానంతరం కన్నడ దేశంలో స్థిరపడి సుమారు 300 సంవత్సరాలు కన్నడదేశాన్ని కేంద్రంగా చేసి దక్షిణ భారతావని అంతటిని ఏక ఛత్రాది పత్యంలోనికి తెచ్చి కడు సమర్ధవంతంగా పాలించిన ఘనత ఈ విజయనగర రాజులదే. కన్నడదేశం కేంద్రం గనుక వీరు ఆంధ్రులు కారేమో ననే అనుమానం చాలామందికి ఉంది. కానీ వీరిది తెలుగువంశం. రెండవ దేవరాయల కాలంలో తెలంగాణాలోని రాచకొండ, రాజమహేంద్రవరం రెడ్డిరాజులు విజయనగర ఆది పత్యాన్ని అంగీకరించారు. రెండవ దేవరాయలు తెలుగుభాషను ప్రోత్సహించాడు. శ్రీనాధునికి తన ముత్యాలశాలలో స్వర్ణాభిషేకం చేసి "కవి సార్వభౌమ" బిరుదు ప్రదానం గావించాడు. శ్రీనాదుడు ఇతనికి తెలుగు రాయలని కీర్తించాడు.

విజయనగర రాజులందరిలో శ్రీకృష్ణదేవరాయలు అతి సమర్ధుడు, ఆయన పేరు తెలియని ఆంధ్రుడుండడు. ఈతడు కళాకారుడు. కళాభిమాని, గొప్పకవి. ఈయన రచించిన "ఆముక్తమాల్యద" అనే గ్రంధాన్ని కృష్ణానది దాటి శాతవాహనుల కాలం నాటి ఆంధ్ర విష్ణు ఆలయాన్ని సందర్శించి, ఆ ప్రాచీన సామ్రాజ్యాధి పతులను స్మృతికి తెచ్చుకొన్న అనంతరం రచించాడు. కృష్ణరాయల పాలనలో ఆంధ్రసాహిత్యం పొందినంత వ్యాప్తి మరే మహారాజుల కాలంలోనూ జరుగలేదని చెప్పాలి. "భువన విజయం" అనే పేరుతో పండిత సభ ఏర్పాటు చేసి ఎనిమిదిమంది ఉద్దండ పండితులను అష్టదిగ్గజాలుగా పోషిస్తూ. రాజ్య. రాజ్యేతర పండితులనూ, శాస్త్రవేత్తలను ఆ సభలో సన్మానించేవాడు.

అష్టదిగ్గజాలలో ఒక్కడయిన అల్లసాని పెద్దన "మనుచరిత్ర" అనే ప్రబంధం వ్రాసి ప్రబంధ కవితాయుగానికి నాంది పలికాడు. వీరి ఆస్థానంలోని కవి ధూర్జటి కాళహస్తీ శ్వర మహాత్యం, కాళహస్తీశ్వర శతకం రచిస్తే- తెనాలి రామలింగకవి వికటకవిగా పేర్గాంచడమేకాక, పాండురంగ మహత్యం వ్రాశాడు. మహాపండితులయిన ముక్కుతిమ్మన, మాదయ్యగారి మల్లన, పింగళి సూరన్న రామరాజ భూషణుడు. ప్రసిద్ధులై ఎన్నో గ్రంధాలు రచించారు. నర్తకి అయిన చెన్నాదేవిని రాయలు వివాహం ఆడినట్లుగా ఎన్నో కధలు ప్రచా రంలో ఉన్నాయి. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో రంజకంకుప్పాయి అనే నాట్య కళా

కోవిధురాలు ఆస్థాన నర్తకిగా ఉండేది. ఈమె మహా పండితులయిన అష్టదిగ్గజాలను, శ్రీకృష్ణ దేవరాయలు, మహామంత్రి తిమ్మరుసు, మొదలగు పండితులను, దేశ, విదేశ పండితోత్తము లను కూడా తన నాట్యకళా విన్యాసాలతో మెప్పించిన నాట్యకళాకారిణి రంజకం కుప్పాయి. ఈమె తండ్రి అయిన శ్రీరంగరాజు వద్ద విద్యను అభ్యసించింది. ఆయనకు "విద్వత్సభా రంజక" అనే బిరుదు ఉండేది. రంజకం కుప్పాయికి ఇరువురు కుమార్తెలు. మొదటి కుమార్తె తిరుమలమ్మ తన నాట్యకళా విన్యాసాలతో అచ్యుతరాయల ఆస్థానాన్ని అలరిస్తే, చిన్న కుమార్తె ముద్దుకుప్పాయి శ్రీ తిరుమల తిరుపతి వేంకటేశ్వరుని ఆలయ నర్తకిగా అంకి తమై తన జీవితాంతం వరకూ స్వామి సన్నిధిలో నర్తించి ఆయనలోనే ఐక్యం అయిన ఆలయనర్తకి.

విజయనగర రాజుల కాలం సాహిత్యం, చిత్రలేఖనం శిల్పం, నాట్యం మొదలగు కళలకు "స్వర్ణయుగం" హంపిదేవాలయాలు, పెనుగొండలోని గగనమహిత మొదలయిన అవశేషాలే నిదర్శనం. చిదంబరం నటరాజస్వామి ఆలయం, తిరువణ్ణామలైలోని ఈశ్వరాల యాలను పునర్నిర్మించి అందమయిన నాట్యకళా శిల్పాలు చెక్కించిన ఖ్యాతి వీరికే దక్కింది. ఈనాటికీ చిదంబర నటరాజ ఆలయంలో మలచిన 108 కర్ణాలు నాట్య భంగిమలు ఆనాటి నాట్యకళా వికాశానికి మచ్చుతునకలు. లేపాక్షిలోని వీరభద్ర దేవాలయం నిర్మించి, ఆ గోడల మీద శివలీలలు, ప్రదర్శించే చిత్రాలు వేయించిన ఖ్యాతి వీరి సామంతునిది. లేపాక్షి చిత్రాలు భారతీయ చిత్రకళలకు, విశిష్టస్థానాన్ని సంతరించిన విషయం అందరూ ఎరిగిన విషయమే.

విజయనగరంలో అనేక నాట్యకళాశాలలు ఉండేవని చరిత్రకారులు వ్రాశారు. ఆనాట్య శాలలలోని అద్భుత శిల్పాలను చూసి ఆనాటి నాట్యకళాకారులు తమ నృత్య భంగిమలలోని తప్పొప్పులను సవరించుకొనేవారట. కానీ అంత అందమయిన నాట్యశాస్త్ర నిబంధనల ప్రకారం మలచిన శిల్పాలున్నా నృత్య కళాశాలలు గానీ, వాటి అవశేషాలుగానీ ఈనాడు మనకు లభ్యం కాలేదు. ఇది మన నాట్య కళాకారుల దురదృష్టం అనుకోవాలి. తెలుగుభాషా వికాశానికి తన జీవితాంతం కృషి చేసిన తెలుగు భాషాభిమాని అయిన శ్రీకృష్ణదేవరాయలు తెలుగుభాషను గూర్చి ఇలా వ్రాశాడు.

తెలుగ దేలయన్న దేశంబు తెలుగేను
తెలుగ రేడ నేను తెలుగొకండ
ఎల్లవారు వినగ ఎరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స.

అని తన తెలుగు భాషాభిమానాన్ని చాటుకొన్నాడు శ్రీకృష్ణదేవరాయలు.

# నాయక రాజుల నాట్యపిపాస

తంజావూరు రాజ్యాన్ని 140 సంవత్సరాలు నాయకరాజులు పరిపాలించారు. వీరిలో ప్రథముడు తెలుగుదేశం నుండి వలసవెళ్ళిన చెవ్వప్ప. ఈయన అచ్యుతరాయల బావమరిది. ఈయన తమిళదేశంలో ప్రజారంజకునిగా కీర్తింపబడినాడు. క్రైస్తవ మత ప్రచారకులు మొట్టమొదటిగా దక్షిణ దేశంలో ప్రవేశించింది ఈ తెలుగు వంశపురాజు కాలంలోనే.

తంజావూరు నాయకరాజులు భాషాపోషణ, శిల్ప, సంగీత నాట్యాది కళల అభివృద్ధికి విశేషకృషి చేశారు. దక్షిణ దేశాన్నంతటినీ దేవాలయాలకు ప్రసిద్ధి గావించారు. ఒక్క తంజావూరులోనే 200 ఆలయాలున్నాయి. వీనిలోని బృహదీశ్వరాలయం మొదలయిన ఎక్కువ ఆలయాలు వీరు కట్టించినవే. వీరిలో కళాభిమాని, పండితుడు అయిన రఘునాధ నాయకుడు అతిముఖ్యుడు. ఎంతోమంది తెలుగు కవులనూ, కవయిత్రులనూ తన ఆస్థానంలో పోషించిన కవివరేణ్యుడు ఈ రఘునాధ నాయకుడు. ఇతడు స్వయంగా పారిజాతాపహరణం, గజేంద్రమోక్షం అనే యక్షగానాలు రచించాడు. "రఘునాధమేళ" అనే సంగీత గ్రంధం రచించాడు. ఈతని గురువయిన గోవింద దీక్షితులు "సంగీత సుధ" అనే సంగీత శాస్త్రగ్రంధం రచించాడు. రఘునాధ నాయకుని ఆస్థానంలో బ్రమరాంబ, మధురవాణి అనే గొప్ప కవయిత్రులుండేవారు. బ్రమరాంబ, సంస్కృతంలో "రఘునాధాభ్యుదయం" అనే గ్రంధాన్ని వ్రాసింది. మధురవాణి రామాయణం వ్రాసింది. ఈ ఆస్థానంలోనే చేమకూర వెంకటకవి వ్రాసిన విజయ విలాసం అనే కావ్యం ప్రభంధ కావ్యాలలో విశిష్టతను పొందింది. రఘునాధనాయకుని కుమారుడు విజయరాఘవ నాయకుడు "రఘునాధాభ్యుదయం" అనే నాటకం వ్రాశాడు తెలుగులో మొదటి నాటకం ఇదే కావడం విశేషం. ఇతని ఆస్థానంలోనే ఐదు భాషలలో పరిజ్ఞానం గల రంగాజమ్మ అనే పండితురాలు మన్నారు దాస విలాసం, ఉషాపరిణయం అనే యక్షగానాలు రచించింది. మహాకవి, పదకవితలకు జీవంపోసిన క్షేత్రయ్య నివశించింది ఈ రాజుల కాలంలోనే నాయక రాజుల కాలం యక్షగానాలకు ఒక విశిష్టస్థానం కల్పించింది. నాయక రాజు , ఇంకా ఎందరో పండితులు యక్షగానాలు రచించి. వాటిని నర్తింపజేసి చూసి ఆనందించడమే గాక యక్షగానం ఆడే నాట్య కళాకారులను విశేషంగా పోషించి సత్కరించేవారు.

తంజావూరు మహారాష్ట్ర రాజులలో ఒక్కడయిన శరభోజి కాలంలోనే త్యాగరాజు జీవించాడు. ఆంధ్రదేశంలో పుట్టి తంజావూరు రాజ్యంలో జీవితాన్ని గడపిన త్యాగరాజస్వామి తన కీర్తనలన్నీ తెలుగులోనే రచించాడు. తంజావూరు నాయకరాజులు నాటిన

తెలుగు భాషాబీజం మహారాష్ట్రవరకూ వ్యాపించింది. తెలుగుభాషలో ఎంతటి పటుత్వం, మృదుత్వం లేకుంటే ఇతర భాషల రాజులు సైతం తెలుగు అభ్యసించి, తెలుగులో రచనలు చేస్తూ, తెలుగు భాషనూ, తెలుగు కళలనూ పోషించారు. ఆలోచిస్తే అర్థం అవుతుంది.

ఈ నాయక రాజుల ఆస్థానంలోనే ముద్దు చంద్రలేఖ, అనే కళాకారిణి ఉండేది. నృత్యంలో ఆమెను మించినవారు ఆనాడు లేరు. అన్ని శాస్త్రాలలో పండితురాలయిన ఆమె రాజాస్థానానికి వెళ్ళడం కొరకు రాజుగారు పంపిన ముత్యాల పల్లకిలో ముందు పగటి దివిటీలు పడుతుండగా ఆస్థానానికి వెళ్ళి అగ్రతాంబూలం అందుకొనేది. అంతటి గౌరవం ఆనాటినుండి ఈనాటి వరకూ మరే నాట్య విద్యాంసునికి దక్కలేదు. ఇంకా కృష్ణాజి, శశిరేఖ, రూపమతి, లోకనాయకి, రత్నగిరి, భాగీరధి, అనే నర్తకీమణులు ఈ నాయకరాజల ఆస్థానంలో నర్తించిన ప్రసిద్ధ నాట్య కళాకారిణులు. స్త్రీలు నర్తించే "పేరిణి" దరుపదం, కోపు, దురసైన కోపు, జక్కిణి, శబ్దచూడామణి, చేపదకేళి వంటి నర్తనాలలో ఈ నర్తకీమణులు ప్రసిద్ధి చెందినవారు. తంజావూరు ఆస్థానంలో నాట్యం, సంగీతం కొలువుతీరాయి. "తంజావూరు సాంప్రదాయం" అనే నాట్యశాస్త్ర సాంప్రదాయం ప్రతేకంగా ఏర్పడింది ఈ రాజుల కాలంలోనే కావడం విశేషం.

# మధురరాజుల నాట్యాభివృద్ధి

మదుర రాజ్యాన్ని 200 సంవత్సరాలు పరిపాలించారు ఆంధ్రనాయకులు. వీరిలో ముఖ్యుడు విశ్వనాథ నాయకుడు. తంజావూరు విజయనగర రాజులను చూసి మధుర రాజులు కూడా తెలుగుభాషను పోషించారు. ఇలా చేసిన వారిలో ముఖ్యుడు తిరుమల నాయకుడు. తిరుమల నాయకుని ఆస్థాన విద్వాంసుడయిన ముఖలింగనమకి కామేశ్వరకవి సత్యభామా స్వాంతనం, రుక్మిణీపరిణయం రచించాడు. పదకవితా పితామహుడయిన క్షేత్రయ్య తిరుమల నాయకుని ఆస్థానాన్ని సందర్శించి అతనిపై కొన్ని పదాలు రచించాడు. సుముఖం వెంకట కృష్ణప్ప అనే కవి అహల్యా సంక్రందనము, రాధికా సాంత్వము రచిస్తే, శేషం వెంకటపతి శశాంక విజయం రచించాడు. వీరి ఆస్థానంలోనే ముద్దు పళని అనే నాట్యశాస్త్ర కళాకోవిదు రాలుండేది. ఆమె తన తల్లి ప్రోత్సాహంతో "రాధికా సాంత్వనం" అనే గ్రంధం రచించింది. ఈ గ్రంధం మగవారు తప్ప ఆడువారు వ్రాయడానికి వీలులేని గ్రంధం అయినా ఆమె రచించడం విశేషం పద్యకావ్యాలే గాక వచన కావ్యాలయిన శ్రీరంగమహత్యం, మాఘ మహత్యం, ఈ కాలంలోనే రచింపబడ్డాయి.

పుదుక్కోట సంస్థానానికి చెందిన రాయరాఘునాధుడు, "పార్వతీ పరిణయం" అనే కావ్యం రచించాడు. పచ్చకప్పురపు తిరువేంగళకవి రచించిన "చొక్కనాధ చరిత్ర" నేటికి దక్షిణాంధ్ర సాహిత్యంలో మొట్ట మొదటి ద్విపదకావ్యం. శ్రీకృష్ణుని నాటి మధురకూ, ఈ మధురకూ సంబంధంలేదు. భారతదేశంలో అందమయిన కన్నులుగల అమ్మవారి ఆలయాలు మూడున్నాయి.

1. కంచి కామాక్షి ఆలయం
2. మధుర మీనాక్షి ఆలయం
3. కాశీ విశాలక్షి ఆలయం

మధుర మీనాక్షి ఆలయం వీరి హయాంలో నిర్మింపబడింది. అద్భుత శిల్పకళాశోభితం ఈ మీనాక్షి దేవాలయం. అంతేగాక వీరి సాహిత్యపోషణకు మరో చక్కని నిదర్శనం నేటికీ నిలిచి ఉన్న "సరస్వతి మహల్" కవి, పండిత, సంగీత నృత్యకళలు ఆదరించిన తిరుమల నాయకుడు కట్టించినదే నేటి "సరస్వతీ మహల్" భారతదేశంలోని అతి ప్రాచీన గ్రంధాలు, శాస్త్ర గ్రంధాలు, పురాణేతిహాసాలు భద్రపరచబడిన అతి ప్రాచీన గ్రంధాలయం ఈ "సరస్వతీమహల్"

# నవాబుల నాట్యపోషణ

విజయనగర సామ్రాజ్య పతనానంతరం ఆంధ్రుల చరిత్రలో తెలంగాణా, కోస్తా ఆంధ్ర ప్రాంతాలు, రాయలసీమ గోల్కొండ నవాబుల పాలనలో ఉండేవి. గోల్కొండ నవాబులలో ప్రజాహితకార్యాలు చేసిన ఇబ్రహిం అనేక మంది కవులను పోషించాడు. కవులు ఇతడిని "మల్కిభరాం" అని ప్రస్తుతించారు. పొన్నెకంటి తెలగన్న అచ్చతెలుగులో యయాతి చరిత్రం వ్రాస్తే, తపతి సవరణోపాఖ్యానం, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానం అనే కావ్యాన్ని సుగ్రీవ విజయం అనే యక్షగానాన్ని వ్రాశాడు. మల్లారెడ్డి శివ దార్మ త్తరం, షట్ చక్రవర్తుల చరిత్ర మొదలగు గ్రంథాలను ఇతని కాలంలోనే వ్రాశారు. వీరుగాక ఇంకా అనేక మంది అనేక గ్రంథాలు రచించారు.

గోల్కొండ నవాబులలో ఆఖరివాడు అబ్దుల్‌హసన్‌కుతుబ్‌షా ఇతనినే తనీషాగా ఆనాటి చరిత్రకారులు కీర్తించారు. తానీషా అంటే మంచిరాజు అని అర్థం. ఇతడు అక్కన్న, మాదన్న అనే ఇద్దరు తెలుగు సోదరులను తన మంత్రులుగా నియమించాడు. భద్రాచల రామాలయం నిర్మించిన కంచర్ల గోపన్న ఇతని రాజ్యంలోనే తహసీల్దారుగా ఉండేవాడు. భక్తుడయిన గోపన్న రాముని సాక్షాత్కారం పొంది అనేక కీర్తనలు, దాశరథీశతకం రచించి రామదాసు అయ్యాడు, తానీషా ఆస్థానాన్ని దర్శించిన క్షేత్రయ్య ఈయనపై కొన్ని పదాలు రచించాడు. కూచిపూడి భాగవతులకు కూచిపూడి అగ్రహారాన్ని దానం చేసింది తానీషా ప్రభువే.

తానీషా కాలంలో భాగామతి, తారామతి అనే ఇద్దరు నర్తకీమణులుండేవారు. ఇతడు భాగామతిని హైందవ ధర్మప్రకారం వివాహం ఆడి, ఆమె పేరుమీదనే భాగ్యనగరం (నేటి ఆంధ్రరాజధాని హైదరాబాద్) ను నిర్మించాడు. ఒక నర్తకికి ఇంతటి ఖ్యాతి గూర్చిన గోల్కొండ నవాబు తానీషా అతడిని తన నాట్యవిన్యాసాలతో మెప్పించిన నర్తకి భాగామతి. భాగామతి తన నివాసం నుండి రాజదర్బారుకు ప్రత్యేకంగా తన కొరకు నిర్మించిన వంతెనపై నృత్యం చేస్తూ రాజదర్బారు చేరి అక్కడ కవి పండితులను తన నృత్యంతో మెప్పించి తిరిగి ఆ వంతెనపైనే తన నివాసం చేరేదట. అంటే కాలు క్రిందనేలపై మోపకుండా దర్బారు చేరేదన్నమాట.

ఇతని కాలంలో భక్తి పెరిగింది. కబీరు, రామదాసు, రామ భక్తులై శ్రీరాముని కీర్తించారు. శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి అనే తత్వజ్ఞుని కాలజ్ఞానం వ్రాశాడు. ఈ నవాబుల కాలంలోనే గేయాలు, శతకాలు రచింపబడ్డాయి. యక్షగానాలు, వివిధ రూపాలలో నాట్య కళాసాంప్రదాయాలు, సలాంజతులు అనేక విధాలుగా అభివృద్ధి చెందాయి.

# సంస్థానాధీశుల కళాపోషణ

ఆంధ్రదేశంలో కార్వేటినగరం, కాళహస్తి, వెంకటగిరి, కొల్లాపురం గద్వాల. వనపర్తి, పిఠాపురం, పెద్దాపురం, నూజివీడు, బొబ్బిలి, తుని, జయపురం మొదలయిన అనేక సంస్థానాలలో నాట్యకళ పోషింపబడింది. సంగీతం ఆదరించబడింది. సంస్థానాలలో పల్లవులు, దరువులు, పదములు, పెద్దవర్గాలు తిల్లానాలు, మొదలయిన సంగీత రచనలు గావింపబడి వాటిపై నృత్యంకూర్చి ప్రదర్శింపబడేది. ఇవే గాక భామాకలాపం, గొల్ల కలాపం, వీధి భాగవతాలు విశేషంగా ప్రోత్సహించబడ్డాయి.

మహారాష్ట్ర ప్రభువుల పాలనలో కేళికలలో రాజనర్తకీమణులు శబ్దాలు, సలాంజతులు, విశేషంగా నర్తించేవారు. సలాంజతులనే రచనాప్రక్రియ నాట్యంకోసమే రచింపబడింది. బొబ్బిలి సంస్థానంలో నాట్యం బాగా ప్రచారం పొందింది. "సభారంజని" అనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని రచించారీ వెలమ ప్రభువులు. కార్వేటినగరం సంస్థానాధీశుడయిన వెంకట పెరుమాళ్‌రాజు కాలంలో నృత్యకళకు అతి ముఖ్యమయిన పెద్దవర్గములుగా పేరొందిన "వర్ణపంచకం" గోవిందసామయ్య అనే పండితునిచే రచింపబడ్డాయి. ఈ వర్ణములపై నృత్యం ఆడటం నర్తకుని నృత్యవిద్యకు పరీక్షవంటిది. పిఠాపురం రావువంశీయుల కాలంలో నాట్యం విశేషప్రచారం పొందింది. వీరి ఆస్థానంలోనే కుంతిమాధవుని ఆలయంలో పెండేల నాగమ్మ అనే పండితురాలు "నవజనార్థన పారిజాతం" అనే భామాకలాపం తొమ్మిది రాత్రులు ఆడిన దరువు ఆడకుండా పట్టిన ముద్రపట్టకుండా నర్తించేది. అభినయించేది. అందుకే ఈ భామాకలాపానికి నవజనార్దనం అనే పేరు వచ్చింది. ఇంత పెద్ద కలాప గ్రంథం భారతదేశంలోని మరే ఇతర ప్రాంతంలోనూలేదు. ప్రసిద్ధి చెందిన కూచిపూడి భాగవతులు మూడు రాత్రులు మాత్రమే ఈ భామాకలాపాన్ని నర్తించేవారు. కానీ తూర్పుగోదావరి జిల్లాలోని ఈ నవజనార్థన పారిజాత భామాకలాపం నిత్య నూతనంగా తొమ్మిది రాత్రులు నర్తించే ప్రబంధకావ్యం కావడం విశేషం.

ఇలా ఎంతోమంది రాజులు, జమిందారులు, సంస్థానాధీశులు నాట్యాన్ని, సంగీతాన్ని, సాహిత్య, శిల్ప, చిత్రలేఖనా కళలను పోషించారు. వారుకూడా నేర్చుకొని ఈ కళల అభివృద్ధికి తోడ్పడితే, మన కళాకారులు భారతావని అంతటా వ్యాపించి, తెలుగు కళలను ప్రచారం చేస్తూ, నూతన ప్రక్రియలు సృష్టిస్తూ, కళాభివృద్ధికే తమ జీవితాలను అర్పించారు. ఎన్నో త్యాగాలు చేశారు.

ఆనాటి మన కళాకారుల కృషి ఫలితమే ఈనాడు మనం నర్తిస్తున్న అనేక నృత్యాలు. ప్రపంచంలోని మరే కళాకారుడు మాతో అభినయించలేడు అని ఈనాడు మనం గర్వంగా చెప్పుకొంటున్నామంటే అది ఆనాటి కళాకారుల కృషి ఫలితమే - కళలను ఆదరించి కళాకారులను పోషించిన రాజులే - జగత్ప్రసిద్ధులవుతారనేది జగమెరిగిన వాస్తవం.

# గజపతుల నాట్యవికాశం

విజయనగరాన్ని ముఖ్య పట్టణంగా గజపతులు విశాఖ జిల్లాలోని విజయనగరం పాలించిన గజపతులలో ఆనందగజపతి. ముఖ్యుడు. ఇతడు, కవి, సంగీత, సాహిత్య కళాపోషకుడు, కళాకారుడు. మాక్స్‌ముల్లర్ అనే జర్మనీ పండితుడు హిందువుల వేదాలను ఆంగ్లంలోకి అనువదించేందుకు ఎంతో ధన సహాయాన్ని అందించాడు. ఈనాటికీ గజపతుల కోట కొండపల్లిలో ఉంది. కొండపల్లి కోటలోని కొండపల్లి బొమ్మలు జగత్ప్రసిద్ధి పొందాయి. గజపతుల సంస్థానంలో సలాంజతులు, శబ్దాలు ఎక్కువగా నర్తింపబడేవి. అన్నింటిలో ముఖ్యమయిన నాట్యం మండూక శబ్దం వీరి కాలంలోనిదే. సీతారామ గజపతి మహారాజు కాలంలో జక్కిణిపదదరువులు, స్వరపల్లవులు విశేషంగా రచింపబడి నర్తింపబడ్డాయి. తూర్పున ప్రసిద్ధిగాంచిన శుభలక్షణ పల్లవి. వీరి కాలంలో, రచింపబడిన నాట్యకళావిన్యాసం గావడం విశేషం.

జగపతులు :- పెద్దాపురం, తుని సంస్థానాధీశులయిన ఈ రాజులు కూడా నాట్యాన్ని, సంగీతాన్ని ప్రచారం చేశారు. నాట్యకళాకారుల నెందరినో సన్మానించారు. వీరికాలంలో కూడా సలాంజతుల ప్రచారం జరిగింది.

# నృత్యరీతులు

మానవ జీవితంలో నృత్యం, సంగీతం ఒక భాగంగా పెనవేసుకుపోయాయి. అలా పెనవేసుకుపోయిన నృత్యవిన్యాసాలను మెరుగుపరచుకొని అనేక వివిధ కొత్త కొత్త రీతులు సృష్టించి తన కిష్టమయిన అనేక పద్ధతులలో నృత్యాన్ని మలచుకొని ఆడి పాడి తాను ఆనందించి, ఇతరులను ఆనందింపజేస్తున్నాడు మానవుడు. మన భారతదేశంలో నాట్యం ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క సాంప్రదాయ నృత్యప్రదర్శనల రూపంలో ప్రచారంలో ఉంది. ప్రస్తుతం మన భారతదేశంలో ఎక్కువగా ప్రచారంలో నున్న నృత్య సాంప్రదాయాలు భరతనాట్యం, ఆంధ్రనాట్యం, కూచిపూడి కథక్, కథాకళి, మణిపురి, ఒడిస్సి, సిరైకేళా, మోహినీ అట్టం, అంకియానాట ఇవి గాక అనేక యక్షగానాలు, కలాపాలు ఇతర ఎన్నో సాంప్రదాయాలు అనేకంగా ప్రచారంలో ఉన్నాయి. ఈ సాంప్రదాయాలు తల్లిదండ్రుల నుండి బిడ్డలకూ, గురువుల నుండి శిష్యులకు వచ్చే అభ్యాసక్రమాలు. కనుకనే భారతదేశం అంతటా భారతీయ నృత్యకళ లన్నింటికీ "నాట్యశాస్త్రం" ఒక్కటే ఆధారగ్రంథం అయ్యింది. ఆ శాస్త్రాన్ని అనుసరించి, ఆయాప్రాంతాలలో అభివృద్ధిచెంది, ఆయాప్రాంతాల ప్రజల అభిరుచులను మత, సాంఘీక పరిస్థితుల ననుసరించి రూపొందినవి. అభివృద్ధి చెందినవి. ఇలా అభివృద్ధి చెందిన, చెందుతున్న నృత్యాలను మన పూర్వీకులు ఐదు భాగాలుగా విభజించారు.

1. దేవాలయ ఆరాధనా నృత్యాలు
2. శాస్త్రీయ నృత్యాలు
3. ప్రచార నృత్యాలు
4. జానపద నృత్యాలు
5. ఆటవిక నృత్యాలు.

ఇలా విభజించబడిన నృత్యవిన్యాసాలే ప్రపంచంలో ఏ దేశం వెళ్ళినా ఈ అయిదు సాంప్రదాయాలలోనే నృత్యం ప్రదర్శింపబడేది, బడుతుంది ఈనాటికీ. మన భారతావనిలో ప్రచారం అయిన ఈ ఐదు సాంప్రదాయ నృత్యాలు. వాటిని గూర్చిన వివరాలు తెలియ జేస్తాను.

# దేవాలయ ఆరాధనా నృత్యాలు

మన భారతదేశంలో వివిధ ప్రాంతాలలో ఈ ఆరాధనా నృత్యాలు దేవాలయాలలో ప్రదర్శించే ఆచారం ఉండేది. ఉదయం ప్రభాతసేవ మొదలుకొని సాయంత్రం పవళింపు సేవవరకూ దేవునికి చేసే వివిధ సేవా కార్యక్రమాలలో నృత్యం విధిగా ప్రదర్శింపబడేది. దేవునికి చేసే షోడశోపచారాలలో ఒక భాగంగా ఈ నృత్యపూజ జరిగింది. ప్రతి దేవాలయంలోనూ ఆ దేవునిపై రచింపబడిన అనేక రచనలపై దేవునికి అంకితమీయబడిన "దేవదాసి" లచే ప్రదర్శింపబడేవి. ఈ దేవదాసీలు ఆగమశాస్త్రం, సంస్కృతం, సంగీత, సాహిత్యం చిత్రకళ మొదలగు కళలలో పాండిత్యం గలిగి ఉండేవారు. వారు దేవుని ఎదుట మాత్రమే నృత్యం చేసేవారు. ఈ దేవాలయ ఆరాధనా నృత్యాలలో దేవదాసీలు ప్రదర్శించే నృత్యాలేకాక వీరభద్రుని సంబరాలలో చేసే వీరనాట్యం, సింహాచల అప్పన్న స్వామికి చేసే సేవ, వివిధ అమ్మవార్ల, గ్రామ దేవతల జాతరలలో చేసే గరగనృత్యం, వీరులకొలువులో వీరనాట్యం, ఇలా అనేక విధాలయిన ఆరాధనా సాంప్రదాయ నృత్యాలు మన ఆంధ్ర దేశంలో ప్రచారంలో ఉన్నాయి. ఆయూరీతులలో నృత్యపూజ నేటికీ జరుగుతుంది. ఇవన్నియూ తాళ లయాశ్రయమయిన నృత్యాలే. ప్రక్కన ఆ నృత్యసాంప్రదాయానికి తగిన వాయిద్యాలు సహకరిస్తుంటే ఆ ప్రాంత సాంప్రదాయం ప్రకారం దేవతలకోసం నర్తించే ఆరాధనా నృత్యాలు

మన పొరుగు రాష్ట్రాలలో కూడా ఈ ఆరాధనా సాంప్రదాయ నృత్యాల ప్రదర్శన అలవాటులో ఉంది. కథకళిలోని సేవాకళి. మహారాష్ట్రలోని అగ్నిదేవుని ఆరాధన, తమిళుల కావడిచిందు అస్సాంవారి అంకియానాట, ఉత్తర హిందూదేశంలోని రామలీల గోండుల ఖర్మనృత్యం, ఒరియావారి పాకహోల్ పండుగలలో చేసే ఆరాధనానృత్యం ఇవన్నీ దేవతల ప్రీతికోసం, దేవతల కృపకై మానవులు చేసే ఆరాధనా నృత్యాలలోని భాగాలే. కానీ కొన్ని గ్రామీణ ప్రాంతాలలోని గ్రామవాసులు చేసే నృత్యాలు గనుక జానపద నృత్యాలుగా చెప్ప బడుతున్నప్పటికీ ఇవన్ని ఆరాధనా నృత్యాలే.

మనకు ఇతర దేశాలయిన టిబెటీయనుల లామానృత్యం, సింహళీయుల పైశాచి నృత్యం ఇలా ఇతర దేశాలలో కూడా ఈ ఆరాధనా సాంప్రదాయ నృత్యశైలి ప్రచారంలో ఉంది. ఈ ఆరాధనా నృత్య పద్ధతులయిన లోకధర్మి, నాట్యధర్మిలను సమంగా పోషించుతూ అందమయిన సాంప్రదాయ నృత్యాలుగా అభివృద్ధి చెందినవి ఈ "దేవదాసీ నృత్యాలు" మాత్రమే. ఈ దేవదాసి నృత్యాలయిన ఆలయ సాంప్రదాయ నృత్యాలు సుకుమారంగా ఉండి దేవతారచనలై, దేవతలకు అంకితమీయబడి ఉంటాయి. ఈ నృత్యాలలో శాస్త్రం,

అభినయం, తాళం, లయ, జతి, గతి, యతి మొదలగు నాట్య శాస్త్రంలో చెప్పబడిన ప్రామాణికమయిన రీతిలో అందమయిన ఆహార్యంతో చూడముచ్చటగా శాస్త్రబద్ధంగా పండితురాండ్రు మాత్రమే ప్రదర్శింపగలిగేవిగా ఉండేవి. అందుకే నాడు నృత్యపూజలేని దేవాలయం, నాట్యమండపంలేని దేవాలయ ప్రాంగణం ఉండేవికాదు. ఈ ఆరాధనానృత్యాలు ఈనాటికీ అద్భుతంగా ప్రజాదరణ పొందుటకు కారణం వాటిలోని నిత్యనూతనమయిన, శాస్త్రీయత మాత్రమే. అతిక్లిష్టమయిన తాళగతులలోను నర్తించడమే ఈ ఆలయ సాంప్రదాయ నృత్యాలలోని ప్రత్యేకత.

అందుకే మన దేవాలయ ఆరాధనా సాంప్రదాయ నృత్యాలు నాటినుండి నేటికీ, నేటికే గాదు ఏనాటికీ నిత్యనూతనత్వంతో విరాజిల్లుతాయి అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

# శాస్త్రీయనృత్యాలు

నాట్యశాస్త్రానికి ప్రామాణిక గ్రంథాలయిన "నాట్యశాస్త్రం" "అభినయ దర్పణం" వంటి శాస్త్రగ్రంథాల ఆధారంగా సప్తతాళాలలో గతి, జతి, యతి, ఛంధ విన్యాసాలు గలిగి ఆయా ప్రాంతాలనేలిన ప్రభువుల, పండితుల, కవుల, గాయక శిరోమణుల, నాట్యకళాకారుల, నాగరిక ప్రజల అభిరుచుల ననుసరించి రూపొందించిన నృత్త, నృత్య, అభినయాలు గలిగి నర్తకి యొక్క ప్రతిభ, నాట్యాచార్యుని పాండిత్యంలను లోకానికి తెలియజేసే నృత్యప్రద ర్శనా అంశాలనే శాస్త్రీయనృత్యాలు అంటారు. దేవాలయ ఆరాధనా నృత్యాలకు దేవాలయాలు ఎలా పట్టుకొమ్మలో, ఈ శాస్త్రీయ నృత్యాలకు రాజాస్థానాలు నిలయాలుగా ఉండేవి. పండిత సభల్లో విరాజిల్లిన సత్‌సాంప్రదాయ నృత్యాలే ఈ శాస్త్రీయనృత్యాలు. రాజుల, సంస్థానాధీశుల అభిరుచినిబట్టి, వారు పోషించిన నాట్యాచార్యులు, నాట్యకళాకారిణులు నాట్యశాస్త్రం ఆధారం జేసుకొని కొత్త కొత్త ప్రయోగాలు చేసి, ఆ నూతన ప్రయోగాలను పండితుల ముందు ప్రదర్శించి వారి మన్ననలను పొందేవారు. రాజుల, రాజకుటుంబీకుల ప్రశంశలు పొందేవారు. అందువల్లనే ఈ శాస్త్రీయ నృత్య సాంప్రదాయాలు బాగా అభివృద్ధి చెందాయి. ఈ నృత్యాల ప్రదర్శన సాధారణంగా తాళలయాశ్రయమయిన నృత్తాలతో ప్రారంభించబడి అభినయ ప్రధానమయిన నృత్యాంశాలతో ముగింపబడేది.

కృష్ణ కర్ణామృతం. గీతగోవిందం, ఆదిశంకరుని అమరుకంవంటి అతిక్లిష్టమయిన రచనలకు అభినయం చేయడమే గాకుండా అన్నమాచార్యుని కీర్తనలు, క్షేత్రజ్ఞులవారి పదాలు, గోవిందసామయ్య పదాలు, ఇంకా అనేకులు రచించిన పదాలు, జావళీలు, పదవర్ణములు, వర్ణములు, పెద్దవర్ణములు, తిల్లానాలు, స్వరజతులు, జతిస్వరాలు, సలాంజతులు, శ్లోకాలు, పద్యాలు ఇలా ఎన్నో ఎన్నెన్నో సంగీతరచనలపై నృత్యం చేసి, అభినయించి పండితు లనూ, పామరులనూ కూడా మెప్పించడం అనాదిగా వస్తున్నదే శాస్త్రీయ నృత్య సాంప్రదాయం.

ఈ శాస్త్రీయ నృత్యాలు ఆంధ్రదేశంలో అనేక పేర్లతోనూ, కర్నాటకలో దాసీ ఆట, కచ్చేరి ఆట, మేజువాణి, కర్నాటక సాంప్రదాయం, సాధిర అని ప్రచారంలో ఉంది. కేరళ లోని మోహిని అట్టం, ఒరిస్సాలోని ఒడిస్సి, ఉత్తర భారతావనిలో కథక్‌గా ప్రచారంలో ఉంది. ఈ నృత్యాలను ఎక్కువగా స్త్రీలే ప్రదర్శించేవారు. పురుషులు గురువులుగా, వాద్య కళాకారులుగా సహకారమందించారు. అందువల్లనే ఈ నృత్య సాంప్రదాయలలోని హస్త, పాద విన్యాసాలు అతి సుకుమారంగా ఉండి స్త్రీలలోని సహజమయిన కోమలత్వానికి అనువుగా స్త్రీలు నర్తనమాడుటకు అనువయిన రీతిలో తీర్చి దిద్దబడినవి, ఈ సత్ సాంప్ర దాయ నృత్యాలు కొన్ని గంటలపాటు ఏకధాటిగా స్త్రీలు ప్రదర్శించుటకు వీలుగా నృత్యాలు

కూర్చబడినాయి. ఆంధ్రదేశం అభినయానికి పెట్టింది పేరు. ఆంధ్రులు అభినయించినట్లు ప్రపంచంలోని మరెవ్వరూ అభినయించలేరు. అతిక్లిష్టమయిన ఆదిశంకరుని అమరుక శ్లోకాలు, ఆధ్యాత్మరామాయణ కీర్తనలకు అభినయించిన ఖ్యాతి ఆంధ్రులకే - అంటే ఆంధ్ర కళాకారిణులకే దక్కింది.

ఈ నృత్యాలు ఎక్కువగా దక్షిణాదిని పాలించిన అనేక హిందూరాజుల అభిష్టానుసారం ప్రాచీన హైందవ సాంప్రదాయాలను ప్రతిబింబించే కళలుగా రూపుదిద్దుకుంటే - ఉత్తరాధిని మహ్మదీయుల సాంప్రదాయాలకు లోనై వృద్ధి చెందాయి. అందువల్లనే దక్షిణ భారతావనిలోని నృత్య సాంప్రదాయాలు హైందవ నాగరికతకు పట్టుకొమ్మలై నేటికీ నిలిచి ఉన్నాయి. కానీ ఉత్తరభారత కళలలో విదేశీయతచోటు చేసుకొని నూతన విధానాలకు ఆలావలంగా నిలిచాయి. అందువల్లనే మన భారతావనిలోని కళలన్నీ - ఉత్తరాది, దక్షిణాది అనే రెండు సాంప్రదాయాలుగా విడిపోయాయి.

ఉదా :- కర్నాటక సంగీతం దక్షిణ భారతావనిలో
హిందుస్థాని సంగీతం ఉత్తర భారతావనిలో
భారతనాట్యం దక్షిణ భారతావనిలో
కథక్ నృత్యం ఉత్తర భారతావనిలో

ఇక వాయిద్యాలు కూడా మృదంగం దక్షిణ భారతావనిలో
తబలా ఉత్తర భారతావనిలో
వీణ వాయిధ్యం దక్షిణ భారతావనిలో
సితార వాయిద్యం ఉత్తర భారతావనిలో

ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో ఎన్నెన్నో ఉదాహరణలు మనకు కన్పిస్తాయి. ఈ శాస్త్రీయ నృత్య ప్రదర్శనావిధానాలలో మనకు ఆనాటి నుండి ఈనాటి వరకూ కూడా.



# ప్రచారనృత్యాలు

దేవాలయ ఆరాధనానృత్యాలు, శాస్త్రీయనృత్యాల అనంతరం మూడవదిగా ప్రచార నృత్యం చెప్పబడుతోంది. పూర్వకాలం నుండి మన భారతీయ సంస్కృతీవికాశం, పురాణేతి హాసాలలోని విశిష్టతను, మత ప్రచారం, రాజకీయ చైతన్యం మొదలగు అంశాలను సామాన్య ప్రజానీకానికి తెలియజెప్పి, అహ్లాదం కల్గించడం కొరకు సంగీత, నృత్యకళా రూపాలను ఉపయోగించుకొనుటనే ప్రచారనృత్యంగా చెప్పబడుతుంది. ఈ ప్రచార నృత్యా లలో సాధారణంగా ఎక్కువ పురుషులే ఉంటారు. వారే స్త్రీ పాత్రలను ధరించి నర్తిస్తారు. స్త్రీలను మరపించేలా అభినయించి ప్రేక్షకులను మెప్పిస్తారు. ఇలా స్త్రీ వేషాలను పురుషులే వేసేందుకు అనేక కారణాలున్నాయి. ప్రచార నృత్యకళాకారులుగా యక్షగాన కళాకారులు భాగవత కళాకారులు రాణించారు. వీరు అనేక బృందాలుగా ఏర్పడి పల్లెలలో, పట్టణాలలో తిరుగుతూ రాత్రి సమయాలందు నాలుగు రహదారుల కూడలిలో తమ ప్రదర్శనలు చేస్తారు. ఇలా దేశ దేశాలు తిరుగుటకు సుకుమారులయిన స్త్రీలు తగరు. స్త్రీలలో ఉండే సహజ మయిన కోమలత్వం, సుకుమారం, ప్రకృతి యొక్క కొన్ని ప్రతికూల పరిస్థితులు, దారిదోపి డుల బెడద ఇలాంటి అనేక రకములయిన ఇబ్బందుల మూలంగా ఈ ప్రచార నృత్య సాంప్రదాయాలలో స్త్రీలు పాల్గొనే ఆవశ్యకతలేదు.

మన పురాణేతిహాసాలలోని అనేక ఘట్టాలను వీరు కనువిందుగా ప్రదర్శిస్తారు. ఈ ప్రచారనృత్యాలు బహుపాత్రా కేళికలు. ఈ విద్య కూడా శాస్త్రీయమే. ఈ కళాకారులు కూడా వివిధ నాట్యశాస్త్రాలు అధ్యయనం చేస్తారు. అయినా సామాన్య మానవునికి అర్థం అయ్యేలా శులభశైలిలో, ప్రజావాడుక భాషలలో, ప్రజలకు అర్థం అయ్యేలా భావ, విన్యాసాలు రూపొం దించి నృత్యకళను ప్రచారం చేస్తున్నారు.

అట్టి కళాకారులలో ముఖ్యులు ఆంధ్రదేశంలోని కూచిపూడి భాగవతులు, తూర్పు భాగవతులు, దాసీ భాగవతులు, గొల్లభాగవతులు, చిందు భాగవతులు, యానాది, దొమ్మరి భాగవతులు మొదలగు వారు మన ఆంధ్రదేశంలో ముఖ్యులు, తమిళనాడులో భాగవతమేళం తేరకూరు భాగవతం. కురవంజి నాట్యములు, కేరళ రాష్ట్రములోని కథాకళి, ఓడుంతుళ్ళత కళాకారులు, కన్నడ యక్షగాన కళాకారులు ఇలా ఎందరో ప్రచార సాంప్రదాయ నృత్య కళాకారులు మన భారతావనిలో ఉన్నారు. వీరందరూ రామాయణ భారత, శివపురాణాలలోని వివిధ ఘట్టాలను నృత్యరూపకంగా ప్రదర్శిస్తారు. ఉదాహరణకు భాగవతంలోని కృష్ణలీలలు, రుక్మిణీకళ్యాణం, ఉషాపరిణయం, రామాయణంలోని లంకాదహనం. రావణగర్వభంగం, భారతంలోని శశిరేఖాపరిణయం, ద్రౌపతీ వస్త్రాపహరణం, కీచకవధ. శివపురాణంలోని

గంగావతరణం, ఇలా ఎన్నో నృత్యకథలను పది లేక ఇరువైమంది కళాకారులు కలిపి నృత్యరూపకంగా ప్రదర్శిస్తారు.

శైవ, వైష్ణవ, శక్తి సాంప్రదాయాలలోని కథలనూ, శాస్త్ర విజ్ఞానం, పాండితీప్రతిభ గల్గిన వీరు-హాస్యరసాన్ని కూడా జతకలిపి ప్రదర్శనను ప్రజారంజకంగా నర్తిస్తారు. వీరి వలననే శాస్త్రీయ పద్ధతులు కొన్ని, అనేక దేశీరీతులు గూడా మన దేశ సంగీత, నృత్యాలందు ప్రచారంలోనికి వచ్చినవి. శైవ వైష్ణవగాథలు విరివిగా ప్రచారం గావింపబడ్డాయి. ప్రజలకు పూర్వకాలంలో పురాణేతిహాసాల సారాన్ని వివరించడానికి సాధ్యపడిన ఏకైక సాధనం ఈ ప్రచార నృత్యకళే అంటే అతిశయోక్తి లేదు. ఒక రకంగా సంగీత, నృత్యాలు గూర్చి సామాన్య జనానికి తెలిసేలా ఉపయోగపడినవి ప్రచారనృత్యాలే. పురాణాలలోని ధర్మాన్ని, సందేశాన్ని ప్రజలకు అందించినవి ఈ భాగవత కళారూపాలే.

కానీ ఈ ప్రచార నృత్యకళ ఈనాడు మరుగున పడిపోయింది. ప్రచారవిద్య ప్రజా రంజకమై అభివృద్ధి చెందిన ప్రాంతాలలో శాస్త్రీయనృత్యం మరుగున పడిపోయింది. శాస్త్రీయ నృత్యం ప్రచారంలో ఉన్న ప్రాంతంలో ప్రచార నృత్యకళ దాదాపుగా అంతరించింది. అందుకు కారణం. ప్రచార సాధనాలయిన భాగవత కళలు కొద్దిపాటి మార్పులు చేర్పులు చేసుకొని శాస్త్రీయ నృత్యకళలపోకడలు సంతరించుకొని ఏకపాత్ర కేళికలుగా రూపొంది ప్రచారం పొందుతున్నాయి.

కానీ మన ఆంధ్రదేశంలో మాత్రం రెండు సాంప్రదాయనృత్యాలు అంటే శాస్త్రీయ, ప్రచార సాంప్రదాయాలు అభివృద్ధి సాధించాయి. ఈ భాగవతకళలు ఈనాడు స్త్రీలు కూడా అభ్యసించి ప్రదర్శిస్తున్నారు. ఏకపాత్రా కేళికలు రూపంలో ఇట్టి కళాఅభ్యాసం మరి ఏ ప్రాంతంలోనూ కనబడదు. మన ఆంధ్రావనిలో తప్ప, ఇది మన తెలుగు జాతికే గర్వకారణం.



# జానపద నృత్యాలు

నాల్గవది జానపద నృత్యం. ఈ జానపద నృత్యసాంప్రదాయానికి శాస్త్ర విజ్ఞానంతో గానీ నాట్యశాస్త్రంతోగానీ పనిలేదు. వివిధ ప్రాంతాలలో వివిధ రీతులలో ప్రచారంలో ఉండే నృత్యం ఈ జానపదనృత్యం. ఈ నృత్యాలు అలంకరణలోనూ, ఆహార్యంలోనూ చూచుటకు చిత్ర విచిత్రంగా అందంగా కనువిందుగా ఉండి చూపరులకు ఆనందాన్ని కల్గిస్తాయి. ఇది కేవలం లోకదర్శిపై ఆధారపడిన నృత్యం. ఉత్సాహభరితమయిన ఈ నృత్యాలు తెలుగు దేశంలో గొబ్బిళ్ళగా సంక్రాంతి పండుగలలో తెలుగు పడుచులు ఆడే నృత్యాలు, కోలాటంలో వర్తించే అరుదయిన భక్తిగీతాలపై నృత్యం. ఇవి కాక చిన్నపిల్లలు ఆడే చెమ్మచెక్క, వుంగిడి మొదలయినవి ఆంధ్రుల మొట్టమొదటి దృశ్యకావ్యం కురవంజి, తోలుబొమ్మలాట. ఈ ఆటలోనే లలితకళలన్నీ - ఇమిడి ఉన్నాయంటే ఆశ్చర్యంలేదు. తెల్లని తెర వెనుక భాగంలో, ఆముదం దీపపు వెలుతురులో రంగురంగులతో చిత్రించిన తోలుతో తయారు చేసిన అందమయిన బొమ్మలను ఆడిస్తూ, పాడుతూ కథను చెబుతూ, మధ్యమధ్యలో హాస్యాన్ని అందించే జుట్టుపోలిగాడు, కేతిగాడు, బంగారక్క, అల్లాటప్పాగాడు వంటి హాస్య పాత్రలతో నృత్యం ఆడిస్తూ కడుపుబ్బనవ్విస్తూ - కవ్విస్తూ - పురాణకథలను దృశ్యకావ్యంగా చూపించే తోలుబొమ్మలాటను గూర్చి ఎంత వ్రాసినా ఇంకా ఎంతో మిగిలిపోతుంది. ఈ తోలుబొమ్మలే నేటి సినిమా యుగానికి నాందీకావచ్చునని ఒక అభిప్రాయం. ఇవేకాక బొమ్మలాట మనకు కనుపించని దారాలను బొమ్మల చేతులకూ, కాళ్ళకు కట్టి, ఆ దారాల చివరలు తన చేతివేళ్ళకు కట్టుకొని తెరవెనుకనుండి బొమ్మల బదులు తానే మాట్లాడుతూ, పాడుతూ, బొమ్మలచేత నృత్యం చేయించే అద్భుతమయిన ప్రక్రియ ఈ బొమ్మలాట ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో జానపద కళారూపాలు జానపద నృత్యాలుగా మనకు దర్శన మిస్తాయి.

నగరాలకు దూరంగా అసంస్కృతంగా జానపదంలో పుట్టి జానపదంలో నివసించే వారి మధ్య పెరిగి వారి మానసిక భావనారూపాల్ని, సుఖదుఃఖాలను, ఖేదమోదాలనూ, యధాతధంగా చిత్రీకరించి చూపించే వాఙ్మయం అంతా జానపదమే. వాటిపై నర్తించే నర్తనం అంతా జానపద నృత్యమే. బుట్టబొమ్మలు నృత్యం, గరగనృత్యం, సంబరాలలో, ఉత్సవాలలో చేసే అనేక నృత్యాలు ఈ జానపద నృత్యాలకు సంబంధించినవే.

కానీ నేడు మనం కొన్ని నృత్యప్రదర్శనలలో చూస్తున్న లంబాడినృత్యం, పాముల వాడు, జాలరివాడు, కోయవాడు, వేటగాడు, జిప్సీ, బంగ్రా ఇవన్నీ వాటి ప్రతిరూపాలు మాత్రమే. మన కళాభిమానులు, కళాకారులు అసలయిన జానపద నృత్య కళాకారులను

తరతరాలుగా జానవద కళాసేవ చేసిన కుటుంబాలను వదిలివేసి, కాదు. మరచిపోయి అను కరణలను చూసి ఆనందిస్తున్నారు. అనుకరణలనే ఆదరిస్తున్నారు. కానీ మనజాతి సంస్కృతికి అద్దంపట్టే కళలుగా చెప్పబడే జానపద సాహిత్యం. జానపద నృత్యరూపాలను మనం విస్మరిస్తున్నాం.

ఇప్పుడు మనంచూసే ప్రదర్శనల స్థానంలోనే అసలయిన జావపద కళారూపాలు ప్రదర్శించేవారి ప్రదర్శనలు ఏర్పాటుచేసినట్లయితే వారిని పోషించిన వారలం అవుతాం. జానపద కళారూపాలను తరతరాలుగా ప్రదర్శిస్తూ ఆ నృత్యరూపాలకే తమ జీవితాలు అంకితంచేసిన కళాకారుడు నేడు ఆదరణ కరువై కూటికోసం మరోవృత్తిని చేనుకొని బ్రతుకు వెళ్ళదీస్తున్నాడు ప్రస్తుతం వేదికలపై ఏర్పాటుచేసే అనుకరణ జానపద నృత్యాల స్థానంలో అసలయిన జానపద నృత్యరూపాలు ఏర్పాటుచేస్తే మన ప్రాచీన జానపద కళా రూపాలకు కొత్తజీవనం ఇవ్వడమేగాక, జాతిసంస్కృతిని అద్దంలో చూపే కళలను పోషించి మనజాతి చరిత్ర పదికాలాలు పచ్చగా ఉంచగల్గుతాం, మన జానపద కళాకారుడు ఆనందంగా జీవించడానికి తోడ్పడినవారలం మనమే అవుతాం.



# ఆటవిక నృత్యాలు

మన ఐదవ నర్తనరీతి ఆటవిక నృత్యాలు. మన ఆంధ్రదేశంలోని వివిధ అడవులలో వివిధ రకాలయిన జాతులవారు కోయలు, గిరిజనులు, సవరలు, గొత్తి, చెంచులు, తోడాలు, గోండులు, బిల్లులు, ఒరియన్లు, గరబలు, ముండాలు, బైరాలు, బిల్లులు, నాగూసులు ఇలా ఎందరో ఆటవికులు అనేక రకాల నృత్యాలు చేస్తారు. వీరు తమ జీవితాలలోని అనేక ఘట్టాలలో నృత్యం ఒక భాగంగా చేసుకొన్నారు. ఆనందమయ సమయాలన్నింటిలో వీరు నృత్యం చేస్తారు. అతి తక్కువ సంఖ్యలో జనాభా ఉన్న గూడేలలో కూడా వీలయినంత ఎక్కువ మంది గుంపులు గుంపులుగా ఈ నృత్యప్రదర్శనలలో పాల్గొని ఆనందించే అమాయకజీవులు ఈ గిరిజనులు వీరు నృత్యమాడే కొన్ని ముఖ్యమయిన సన్నివేశాలను గూర్చి తెలుసుకుందాం.

ఒక యువకుడు ఒక యువతిని అర్థాంగిగా ఎన్నుకొనే సమయంలో, వారి వివాహ సమయంలో, బిడ్డలు పుట్టినప్పుడు, పుత్రోదయ సమయంలో ఆనందమయమయిన నృత్యం చేస్తారు. బిడ్డల బారసాలలలో నృత్యవేడుక, ఇంకా ఎన్నో జీవిత సంబరంలో జరిగే అనేక సందర్భాలలో వీరు నృత్యం చేస్తారు. ఆఖరుకు అలిసితనువు చాలించిన జీవి స్వర్గానికి చేరాలనే ఆశతో, ఆ శరీరాన్ని స్మశాన వాటికకు చేర్చే సమయంలో అలసట లేకుండా వివిధ భంగిమలలో నృత్యం ఆడటం విశేషం. వీరు అమాయక జీవులు ఆకాశం నిండా అందమయిన తెల్లని వెన్నెల నిండిన రాత్రులు, నిండుపున్నమి రాత్రులలో, అతిధులు తమ గూడేలకు వచ్చినప్పుడు ఆహ్వానిస్తూ వారి వినోదం కొరకు నృత్యం చేసి, వారు వెళ్ళే సమయంలో వీడ్కోలు చెప్పే నృత్యం చూడదగిన నృత్యం, హృదయంలేని ఖఠినాత్ముడిని కూడా ఆనందోత్సాహాలతో తేలియాడేలా చేసే వీరి నృత్యకళ గూర్చి వ్రాయడానికి వాఖ్యాలు సరిపోవు.

పంటలు పండించే సమయంలో ముందుగా దేవతలను ఆరాధిస్తూ పూజానృత్యం, వానదేవుని ఆహ్వానిస్తూ విచిత్రనృత్యం, పంటలు పండే సమయంలో విరివిగా పండాలని ఆశతో ఖర్మ నృత్యం క్షుద్రదేవతలు, వారి శక్తులు నుండి పంటలను కాపాడుకొనుటకు చేసే వికటనృత్యం, పండిన పంట ఇంటికి చేరిన అనంతరం వీరు చేసే ఆనందకోలాహల మయమైన నృత్యం, ~~ఈ విధంగా ఎన్నో సందర్భాలలో నృత్యం చేస్తారు~~ ఆటవికులు, నాగరికుల కంటే ఆటవికుల జీవిత వ్యవస్థలోనే ఈ నృత్యం ఎక్కువగా పెనవేసుకుపోయింది. ఇది ఈనాటికి నిలిచి ఉండటం హర్షించదగ్గ విషయం.

వీరు గుంపులు గుంపులుగా, వలయాలుగా, చతురస్రాకారంలో ఇలా వివిధ రకాలుగా నిలబడి విచిత్రమయిన వాయిద్యాలు కొమ్ముబూరలు ఊదుతూ, రకరకాల శబ్దాలు చేస్తూ,

ఆనందంగా, విచిత్రంగా, విలాసంగా, వికటంగా నృత్యం చేస్తారీ ఆటవికులు వీరి వేషభాషలు వీరు నృత్య సమయాలలో అలంకరించుకొనే తీరు అతి విచిత్రంగా మనకు అన్పించినా అది వారి వారి సాంప్రదాయానుసారంగా ఉంటుంది. అయినా ఎంతో ఆకర్షణీయంగా చూపరులకు ఆనందం కల్గిస్తుంది వీరి ఆహార్యం. వారికి దొరికే అతి సామాన్యమయిన వస్తువులనే అలంకరణలుగా మార్చుకొని, అలంకరించుకొని ఆనందంగా నృత్యం చేస్తారు. చూడముచ్చటయిన అలంకరణలు నాగరికులను మించి చేసుకుంటారీ ఆటవికులు. ఆటవికుల జీవితంలో పెనవేసుకు పోయింది. నృత్యసాంప్రదాయం.

ఆటవికుల జీవితమే ఒక నృత్యం

నృత్యమే ఆటవికుల జీవితం.



# ఆలయ నర్తకి

మన భారతదేశంలో ప్రాచీన కాలంనుంచి దేవాలయాలే లలితకళలకు. ముఖ్యంగా నాట్యానికి పట్టుకొమ్మలై నిలిచాయి. ఆలయాలలో స్వామి సన్నిధిని జరిగే నృత్యపూజలో ఆరాధనా నృత్యాలు, కళ్యాణ మంతపంలో కేళికలు ఇవి అన్నియూ దేవాలయ నర్తకీమణులే చేసేవారు. స్వామి సన్నిధిలోని బలిపీఠంపై నృత్యంచేసే అర్హత, అధికారం దేవాలయ నర్తకీమణులయిన దేవదాసీలకే ఉంది.

పదేళ్ళప్రాయంలో దేవదాసి కావలసిన బాలికను దేవాలయానికి అర్పించేవారు. ఆమెకు సకల లాంచనాలతో శాస్త్రోక్తంగా దేవునితో వివాహం జరిపించేవారు. ఆనాటినుండి ఆమె జీవితం దేవుని సేవకు అర్పించబడి దేవదాసిగా కీర్తింపబడేది. ఈ దేవదాసిలు అస్ఖలిత బ్రహ్మచారిణులు అగుటచే దేవదాసి అనేకులం ఏర్పడే అవకాశం గలుగలేదు. ఈనాడు ఆలయ సాంప్రదాయ నృత్యాలు మరుగున పడిపోవడానికి ఇది ఒక ముఖ్యకారణం కావచ్చును. తెలుగుదేశంలో పూర్వ, మధ్యకాలములలో నర్తకీమణులు లేని దేవాలయం నాట్యమంతపంలేని ఆలయప్రాంగణం ఉండేదికాదు అనడానికి నేటికీ మనకు అనేక తార్కాణాలు కనబడుతున్నాయి. ఆలయ ఆవరణలోని మంతపంలో స్వామి వేంచేసి కొలువుతీరి ఉన్న సమయాలలో మాత్రం ఆలయనర్తకీమణులేగాక, అనేక మంది నాట్య కళాకారిణులు కూడా నాట్యం చేసేవారు. ఇది వినోదార్ధం ఏర్పాటు కాబడిన నృత్యప్రదర్శనం దీనినే ''కేళిక'' అంటారు.

ఒక దేవాలయంలో ఒకరిని మించి ఎందరైననూ ఆలయనర్తకీమణులు ఉండవచ్చును. దేవాలయంలో స్వామివారికి చేసే ప్రభాతసేవ మొదలుకొని, పవళింపు సేవవరకూ వివిధ సేవలలో ఈ నృత్యపూజ జరిగేది. ఆ నృత్యపూజకు కావలసిన వాయిద్య కళాకారులు. కళాకారిణులు మొదలయిన వారందరినీ పోషించుటకు ఆ ఆలయంలోనే అన్ని ఏర్పాట్లు జరిగేవి. వారిజీవితం సాధన చేయడం దేవుని కొలవడం మాత్రమే వారి జీవితధ్యేయం. అలా తన జీవితాంతంవరకూ ఆలయంలోని స్వామిని కొలిచి స్వామి సన్నిధిలోనే తనువు చాలించి స్వామిలోనే లీనమయ్యే అదృష్టం అవకాశం ఈ దేవాలయ నర్తకీమణులకు మాత్రమే దక్కింది. అంతటి పుణ్యమూర్తులు దేవాలయ నర్తకీమణులు. స్వామి వారికి జరిగే అంగ, రంగ వైభోగాలకు అనేక దానాలు సమర్పించేవారు ఆనాటి భక్తులు. అంగభోగమంటే దేవుని అలంకరణ, రంగభోగమంటే నృత్య, సంగీతవాద్య సేవజేయుట, ఇలా నిత్యం జరిగేందుకు ఎందరో మహారాజులు, ధనవంతులు, పండితులు ఆలయాలకు భూమిని వస్తువులనూ, గోవులనూ ఇలా ఎన్నోరకాలుగా దానాలు ఇచ్చి తమ భక్తిని చాటుకొని, ముక్తిని పొందారని చెప్పేందుకు మన ఆంధ్రదేశంలోనే ఎన్నో శాశనాధారాలున్నాయి. దీనిని బట్టి ఊహించవచ్చు మన దేవాలయాల, ఆ ఆలయాలలోని నర్తకీమణుల ప్రతిభా విశేషాలు.

రెడ్డిరాజుల కాలంలో దేవాలయాలలో ఈశ్వరునికి పూజ జరిగే సమయంలో అనేక శైవసాంప్రదాయ నృత్యాల ప్రదర్శనం జరిగేదని "కవి సార్వభౌముడు" శ్రీనాధుడు, పేర్కొన్నాడు.

మహార్నవమి ఉత్సవాలలో తొమ్మిది రోజులు శ్రీకృష్ణదేవరాయలవారు ప్రతి ఉదయం దైవదర్శనానికి వచ్చే సమయంలో నృత్యప్రదర్శనం అంటే నృత్యపూజ జరుగుతూనే ఉండేదని విదేశీ యాత్రికుడయిన చరిత్రకారుడు "డామిగోఫేయస్" వివరించాడు. ఇలా ఎన్నో నిదర్శనాలు, ఆధారాలు మనకు ఆనాడు రచింపబడిన ప్రముఖుల గ్రంథాల వలన తెలుస్తుంది.

దేవాలయ నర్తకీమణులను మన పూర్వీకులు ఎంత పవిత్రభావంతో చూచేవారో తెల్పుటకు ఒక చిన్న కథ తెల్పుతాను. ఇది కథకాదు వాస్తవం, నమ్మలేని నిజం ఈనాటికీ మనందరి పూజలందుకొంటూ ఒక ఆరాధ్య దైవంగా పూజింపబడుతున్న ఒక ఆలయనర్తకి కథ.

నమ్ముతారా ? అయితే చదవండి.

ఆంధ్రదేశంలో వీరశైవం విరివిగా ప్రచారంలో ఉన్న రోజులలో ఆంధ్రావనిలో ఎక్కడ చూసినా శివాలయాలు అద్భుత శిల్పకళలతో, నృత్యపూజలతో విరజిల్లుతుండేవి. ఆ కాలంలో వెలిసినవే పంచారామాలు. అమరావతి అమరలింగేశ్వరస్వామి, సామర్లకోట రాజేశ్వరస్వామి, పాలకొల్లు క్షీరారామలింగేశ్వరస్వామి ద్రాక్షారామ భీమేశ్వరస్వామి, భీమారామం సోమేశ్వరస్వామి ఆలయాలు. వాటిలో ముఖ్యమయింది, నాట్యప్రసిద్ధి కలిగింది. అయిన ద్రాక్షారామం నాటి దక్షప్రజాపతి యజ్ఞం చేసిన దక్షవాటిక, అక్కడే దక్షుని గర్వమణచేందుకు వీరభద్రుడు వీరనాట్యం ఆడాడు. అటువంటి ద్రాక్షారామ భీమేశ్వరుని ఆలయంలో తన ఆనందభాష్పాలతో స్వామిని అభిషేకించి, తన నేత్రసుమాలతో పూజించి, తనలోని కోర్కెలను దూపంవేసి, తన చరిత్రను పవిత్రపరచుకొని తాను మాత్రం స్వామి సన్నిధిలో జ్యోతిగా వెలుగుతున్న దేవనర్తకి మాణిక్యాంబ, అతి వినయంతో, నియమనిష్టలతో, శాస్త్రీయ నాట్యకళోపాసనతో స్వామిని ఆరాధించి, తన జీవిత సర్వస్వమూ స్వామికి అంకితమొనర్చి, చివరకు స్వామిలో లీనమయ్యి తనువు చాలించిందీ పుణ్యమూర్తి అయిన మాణిక్యాంబ, ఆమె భక్తికి ఆ గ్రామ ప్రజలు సంతసించి, ఆమెమీద భక్తితో ఆలయంలోని అమ్మవారిని మాణిక్యాంబగా పూజించటం ప్రారంభించారు. నాటినుండి నేటి వరకూ ద్రాక్షారామ భీమేశ్వరుని సన్నధిని అమ్మవారు మాణిక్యాంబగా విరాజల్లుతుంది. పూజలందుకొంటుంది.

చూశారా ఆనాటి ప్రజలకు ఆలయనర్తకి అంటే ఎంత పవిత్రమయిన భావం ఉండేదో?

ఆలయ నర్తకిని గూర్చిన మరోకథ, ఇది కథకాదు యదార్థగాథ చరిత్రపుటలలో నిలిచిన అపూర్వ సంఘటన.

తమిళదేశాన్ని చోళులు పాలించుచున్న రోజులలో ఆ దేశపు రాజు మారువేషంలో రాజ్యపర్యటన గావించి ప్రజల కష్టసుఖాలను స్వయంగా తెలుసుకొనేవాడు, అలా పర్యటించే సమయంలో కావేరినది ఒడ్డున చిన్ని గ్రామంలో ఒక అర్ధరాత్రి గజ్జెల సవ్వడి వినిపించింది ఎక్కడానాధం అని పరికించి చూచిన రాజుకు ఒక పూరిగుడిశె, ఆ గుడిశెనుండి వీనుల విందైన సంగీతం, లయవిన్యాసాల మృదంగవాద్యం, అద్భుతపదవిన్యాసాలతో గూడిన గజ్జెల సవ్వడి విన్పించింది, అది విని పులకించిన రాజు నృత్యం చూడాలనే ఆపేక్షతో లోనికి

వెళ్ళాడు. తానొక కళారాధకునిగా తనను తాను పరిచయం చేసుకొన్నాడు. కానీ అతనిని చూసిన వెంటనే నాట్యసాధన చేస్తున్న నర్తకి తన కాలిగజ్జలు విప్పివేసింది. మృదంగం వాయిస్తున్న ఆమె తండ్రి వాయిద్యం కట్టిపెట్టేశాడు. మారువేషంలో ఉన్న రాజుకు నిరాశ కల్గింది. ఎలా అయినా ఆమె నృత్యం చూడాలనే పట్టుదలతో ఆ వూరిలోనే కొన్నిరోజులు ఉండిపోయాడు. ఎన్నిసార్లు అడిగినా ఆమె నృత్యం చూసేభాగ్యం అతడికి కలుగలేదు. ఆఖరుకు విసిగిపోయిన రాజు ఆమె తండ్రి లేని సమయం చూసి ఆ నర్తకిని నాట్యం చేయమని నిర్బంధించాడు. గత్యంతరం లేక ఆమె నాట్యమాడేందుకు సిద్ధపడుతుండగా, అంతలోనే ఆమె తండ్రి తిరిగివచ్చి పరిస్థితిని అర్థంచేసికొని ఇలా అన్నాడు. నాయనా! దేశాన్ని పాలించే మహారాజువు, నీకీ పనితగదు ఆమెను దైవానికి అర్పించదలిచాను. ఆమె దేవుని ముందు మాత్రమే నాట్యం చేస్తుంది. అని అన్నాడు.

తన మారువేషం గుర్తుపట్టిన ఆమె తండ్రిని చూచి విస్తుపోయి ఆశ్చర్యంతో అదే విషయాన్ని ఆయనను అడిగాడు మహారాజు, నాయనా! ఖఠినశిలలను తొలిచి సజీవ మూర్తులుగా మలిచే శిల్పినైన నాకు నిన్ను గురుపట్టడం, నీ నిజరూపం తెలుసుకోవడంలో ఆశ్చర్యపడవలసిన విషయంలేదు. నీ కోర్కె నెరవేరాలంటే "బృహదీశ్వరునికి" ఆలయం నిర్మించు. స్వామి ప్రతిష్టరోజున ఆమె "పుష్పాంజలి" సమర్పిస్తుంది అన్నాడు ఆ తండ్రి.

రాజు రాజ్యానికి తిరిగివెళ్ళి తంజావూరులో బృహదీశ్వరాలయం నిర్మించాడు. అద్భుత శిల్ప విన్యాసాలతో. నాట్యభంగిమలతో బ్రహ్మాండమయిన ఈశ్వరాలయం ఆ నర్తకికి నాట్యం నేర్పిన ఆమె తండ్రిచేత నిర్మింపబడింది. ఆ ఆలయంలోని ప్రతి శిల్పవిన్యాసాలకూ ఆమె నాట్యభంగిమలే ప్రాణం. అలా నిర్మింపబడిన ఆలయములో స్వామి ప్రతిష్టరోజున ఆ నర్తకి తన నృత్యగానాలతో స్వామిని సేవించింది. పుష్పాంజలి ఘటించి తన జన్మసార్థకం చేసుకొన్నది. ఆ దేవాలయ నర్తకియే ఆ అపురూప శిల్పకళాసృష్టికి కారణం అయినట్లుగా నేటికీ తంజావూరులో చెప్పుకుంటూనే ఉంటారు.

బృహదీశ్వరుని సేవించి తన జన్మసార్థకం చేసుకొన్న ఆ ఆలయ నర్తకిపేరు "కళ్యాణి"

బృహదీశ్వరుని ఆలయం నిర్మించిన శిల్పి ఆమె తండ్రి అతనిపేరు "గోవిందాచారి"

బృహదీశ్వరుని ఆలయం నిర్మాణం గావించిన మహారాజు "రాజరాజ చోళుడు"

ఈనాటికీ నిలిచి ఉన్న తంజావూరులోని బృహదీశ్వరుని ఆలయం ఆ ఆలయ నర్తకీమణి యొక్క ప్రతిభను చాటుతూనే ఉంది. ఈ విధంగా ఎన్నో ఎన్నెన్నో చరిత్రలు ఉన్నాయి. ఈ దేవాలయ నర్తకీమణులు శివాలయాలలో శైవసాంప్రదాయనృత్యాలు, వైష్ణవాలయాలలో వైష్ణవ సాంప్రదాయ నృత్యాలు. అమ్మవారి ఆలయాలలో శాక్తేయసాంప్రదాయ నృత్యాలు నర్తించి తమ జన్మసార్థకం చేసుకొని స్వామిలో ఐఖ్యం అయ్యేవారు ఈ దేవాలయ నృత్యాలలో కైవారాలు, కౌతాలు, ప్రధానమయిన నృత్యాలుగా ప్రసిద్ధి పొందాయి.

దేవాలయ నర్తకి జీవితం ఒక దేవతానృత్యం
దేవాలయ నర్తకి జీవితం ఒక దైవానికే అంకితం
దేవాలయ నర్తకి ఒక ధన్యజీవి.

# ఆస్థాన నర్తకి

ఆస్థాన నర్తకి జీవితం కత్తిమీద సాములాంటిది. ఆమె అనుభవించలేని సుఖముండదు ఆ రాజ్యంలో కానీ అతికష్టతరమైనదీ ఆస్థాన నర్తకీపదవి. స్వతంత్రభావాలకు, మానసిక వికాసానికి, మానసిక ఆనందానికి చాలాదూరం ఈ ఆస్థానన ర్తకి జీవితం. ఒకరి అధికారానికి, ఒకరి మెప్పుకొరకూ జీవించే ఆస్థానన ర్తకికి స్వేచ్ఛలేదు, కానీ సర్వసుఖాలకు నిలయం ఆమె జీవితం ఆపదవి ఉన్నంతకాలం ఆమె ఏం కోరినా అది నెరవేరుతుంది. ఒక ఆలయంలో ఎంతమంది అయినా ఆలయన ర్తకీమణులు ఉండవచ్చును. కానీ ఒకరాజు ఆస్థానంలో సాధారణంగా ఒకేరాజ నర్తకి మాత్రమే ఉంటుంది, ఆమె తప్పనిసరిగా మహాపండితురాలై ఉంటుంది. ఒక్క నాట్యశాస్త్రంలోనే గాక సకల శాస్త్రాలలో ప్రవీణురాలై అసమాన ప్రతిభ గల్గి ఉండాలి. రాజనర్తకి తన నివాసం నుండి బయలుదేరి రాజాస్థానానికి వెళ్ళి తిరిగి తన నివాసానికి వచ్చేవరకూ ఆమె మనసుకు శాంతి ఉండదు. కారణం ఆనాటి సభలో ఎవరు ఏ ప్రశ్న వేస్తారో, ఏ పండిత శిఖామణి ఏ అభినయం చేయమంటాడో, ఏ కవికుమారుడు తన పాటలకు, కవితలకు అభినయం చేసి చూపమంటాడో, ఇవన్ని సాధారణంగా ప్రతి రాజ్యసభలోనూ జరిగే విషయాలు. ప్రతిభావంతురాలయిన నర్తకీమణికి ఇవి ఆనందాన్నే కల్గిస్తాయి. వీటినిగూర్చి ఆమె ఆలోచించదు. కానీ ఇతర దేశాలనుండి, ఇతర రాజ్యాలనుండి కవులు పండితులు, నర్తకులు, నర్తకీమణులు, వాద్యకళాకారులు, వచ్చి తమను ఎదిరించవలసినదిగా సవాల్ చేస్తారు. ఆ సవాళ్ళను ఎదుర్కొవాలి. ఆ సవాల్ ననుసరించి తమ విద్యానైపుణ్యంతో వారిని ఓడించాలి. ఆనాడు రాజ్యం యొక్క పరువు ఆమెపైనే ఆధారపడి ఉంటుంది. లేకుంటే రాజుల మనస్సులకు బాధ, రాజ్యప్రతిష్టకు భంగం కలుగుతుంది. అలా జరిగిన తక్షణం రాజు సద్గుణ సంపన్నుడయితే దయామూర్తి అయితే మంచిదే, అలాకాకుంటే ఆనాటితో ఆ ఆస్థానన ర్తకి జీవితం, లేదా పదవి సరి.

ఒకరిపై ఆధారపడిన జీవితం ఆస్థానన ర్తకి జీవితం. నృత్యవిద్యలో మిన్నయగుటకు "దేవదాసి" అనబడే ఆలయనర్తకి ఎంత సాధన చేయవలసి ఉందో, "రాజనర్తకి" అనబడే ఆస్థానన ర్తకి అగుటకు వారాంగనలు అంతకంటే ఎక్కువగా శ్రమపడాలి. వారి చిన్ననాటి నుండి అందాలను, విద్యను దినదినాభివృద్ధి గావించుకోవాలి. అవయవాలను ఎప్పటికప్పుడు అందంగా తీర్చిదిద్దుకోవాలి. చూడగానే చూపరులను ఆకట్టుకోగల అందగత్తె ఉండాలి. కుసుమకోమల మూర్తులీ ఆస్థాన నర్తకీమణులు, వీరి సౌందర్యపోషణ విషయంలో అత్యంత శ్రద్ధ వహించాల్సి ఉంటుంది.

ఇలా ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొంటూ తమ రాజ్యానికి, రాజులకూ కీర్తినితెచ్చి. చరిత్రలో తమ పేరు చిరస్థాయిగా నిలుపుకొన్న ఆస్థాన నర్తకీమణులు ఎందరో ఉన్నారు.

చాళుక్యుల కాలంలో చెల్లవ్వ, చెమెకాంబలు.
కాకతీయుల నాటి మాచల్దేవి.
కృష్ణదేవరాయల ఆస్థానంలో రంజకం కుప్పాయి.
నాయకరాజుల నాటి ముద్దు చంద్రలేఖ.

ఇలా ఎందరో, ఎందరెందరో మహా పండితురాండ్రయిన ఆస్థాన నర్తకీమణులు ఉన్నారు. రాజుల ఆస్థానమందలి నృత్యాలు రెండు విధములుగా ఉంటాయి.

1. దేశి నాట్య పద్ధతి
2. మార్గ నాట్య పద్ధతి.

మార్గ నాట్య పద్ధతి నాట్యశాస్త్రానుసారంగా ఉంటుంది. దేశి నాట్యపద్ధతి ఆయా దేశాల రాజుల, ప్రజల మనోభావాలకు వారి ఆనందానికి అనువుగా తీర్చి దిద్దబడినదిగా ఉంటుంది. కానీ విద్యకు రాణింపు, గుర్తింపు ఆదరణ ఒక్క రాజుల ఆస్థానాలలో మాత్రమే ఉంటుంది. విద్యావ్యాప్తికి ఈ రాజాస్థానాలు ఆ ఆస్థానంలోని నర్తకీమణులు, వారి గురువులే ముఖ్యకారకులు. ఆస్థాన నర్తకీమణులను, వాద్యకళాకారులను రాజులు పోషించి వారి వారి విద్యలలో కొత్త కొత్త పద్ధతులు ప్రవేశపెట్టడానికి కారకులు అయ్యారు. ఈనాడు నాట్యకళ ఇంత అభివృద్ధి చెందడానికి కారకులు ఆనాటి ప్రతిభావంతులయిన నాట్యకళాకారిణులు, వారిని పోషించిన సహృదయులయిన మహారాజులే అనటంలో అతిశయోక్తి లేదు. ఆనాడు వారు నాట్యం తదితరకళలను పోషించకుండా ఉంటే, నర్తకీమణులు కృషి చేయకుండా ఉంటే, ఈనాడు మన సాంప్రదాయాలకు అద్దం పట్టే నృత్యకళారూపాలు మిగిలిఉండేవి కావు. ఇది జగమెరిగిన సత్యం.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో "రంజకం" వంశానికి చెందిన కుప్పాయి అనే నర్తకీమణి ఉండేది. ఆమె తండ్రి నాట్యకళలయందు ఉద్దండ పండితుడు. అతడే ఆమెకు గురువు అతడి పేరు శ్రీరంగరాజు. నాట్యకళలో వీరికి వీరేసాటి. అందువల్లే మహాపండితులయిన అష్టదిగ్గజాలు, సాహితీవేత్త "విద్వత్సభారాయ" బిరుదాంకితుడయిన శ్రీకృష్ణదేవరాయలు, తిమ్మరుసు మొదలగు పండితులు, వీరేగాక అనేక దేశవిదేశీ పండితులు, రాయబారులు, అతిధులు వీరందరి ముందు తన నాట్యవిద్యను ప్రదర్శించి వారి మెప్పు పొందిన ఏకైక నర్తకీమణి కుప్పాయి. అందువలనే శ్రీకృష్ణదేవరాయలు ఆమెకు, ఆమె తండ్రి శ్రీరంగరాజుకు "విద్వత్సభారంజక" అనే బిరుదు ప్రదానం చేశాడు. దీనిని బట్టి ఊహించవచ్చు ఆనాటి వారి నాట్యకళాప్రతిభా విశేషాలు. శ్రీరంగరాజు, కుప్పాయి కూడా తిరుపతి శ్రీ వెంకటేశ్వర స్వామివారికి అనేక దానాలు ఇచ్చినట్లుగా ఆధారాలున్నాయి. రంజకం

కుప్పాయికి ఇరువురు కుమార్తెలు మొదటి కుమార్తె అయిన తిరుమలమ్మ శ్రీకృష్ణదేవరాయల అనంతరం విజయనగర సింహాసనం అధిష్ఠించిన అచ్యుతరాయలి ఆస్థానంలో ఆస్థాన నర్తకిగా గౌరవింపబడింది. రెండవ కుమార్తె ముద్దు కుప్పాయిని అచ్యుతరాయలు తిరుపతి శ్రీ గోవిందరాజ స్వామివారి ఆలయంలో ఆలయనర్తకిగా నియమించారు. ఆనాటి నుండి ఆమె వంశంలోని వారందరూ శ్రీ తిరుపతి వెంకటేశ్వరుని తమ నాట్యకళావిన్యాసాలతో ఆరాధించి తరించారు.

ఇక నాయకరాజుల ఆస్థానంలో నాట్యకళ నిండుపున్నమి నాటి వెన్నెలలా రాజ్యమంతా వ్యాప్తి చెందింది. నాట్యకళకు ఈ రాజుల కాలం ఒక సువర్ణఘట్టం, తంజావూరు పాలకుడయిన అచ్యుతప్ప నాయకుని పరిపాలనలో ఆంధ్రదేశం నుండి కొందరు నాట్యకళాకారులు వలస వెళ్ళిపోయారు. వారిని ఆదరించి, ఆశ్రయం కల్గించిన అచ్యుతప్ప నాయకుడు. తనపేర ఒక అగ్రహారం వారికి దానం చేశాడు. అచ్యుతాపురం, అదే నేటికీ ప్రసిద్ధ సాంప్రదాయ నృత్యానికి మూలం అయిన "మేలట్టూరు." ఈ మేలట్టూరు సాంప్రదాయ నృత్యమే ఈనాటికీ మేలట్టూరు భాగవతనృత్యానికి మూలం అయింది. ఈనాటికీ "మేలట్టూరు భాగవతం" ప్రసిద్ధ సాంప్రదాయ నృత్యంగా ఆదరింపబడుతోంది.

రఘునాధనాయకుని ఆస్థాన నర్తకీమణి ముద్దు చంద్రలేఖ ఆమె అభినయకళలో గొప్ప పండితురాలు, నాట్యం ఆడటంలో ఆమెను మించినవారు లేరు ఆనాడు. అన్ని శాస్త్రాలు క్షుణంగా ఎరిగిన మహాపండితురాలు ఆమె. అందుకే రఘునాధనాయక మహారాజు ఆమె ఆస్థానానికి రావాలంటే ముత్యాలపల్లకిని పంపేవాడు. పల్లకిలో ఆమె ఉంటే పల్లకి ముందు వందిమాగతులు పగటి దివిటీలు పట్టేవారు. పగటి దివిటీల గూర్చి వివరించాలంటే విద్యుత్ దీపాల కాంతిలేని ఆ రోజులలో పెద్దలకూ, పండితులకూ, ధనవంతులకూ మాత్రమే రాత్రిపూట దివిటీలు పట్టుకొని దాసీజనం నడుస్తుండగా ఆ వెలుగులో వారు నడచి వెళ్ళేవారు. అది ఆనాడు సామాన్యునికి సాధ్యంగాని విషయంగా, వ్యక్తుల గొప్పతనానికి నిదర్శనంగా ఉండేది రాత్రిపూట దివిటీపట్టి ప్రయాణించడమే గొప్ప విషయం. అటువంటిది పగటిపూట దివిటీలు పట్టి దాసీజనంముందు నడుస్తుండగా, రాజావారు పంపిన ముత్యాల పల్లకిలో,మంగళ వాయిద్యాల నడుమ రాజాస్థానానికి వెళ్ళి అగ్రతాంబూలం అందుకొనేది ముద్దు చంద్రలేఖ ఈ సంఘటనను బట్టి ఊహించవచ్చు ఆనాటి నాట్యకళలో ఆమె ఎంతటి ప్రతిభావంతురాలో. రఘునాధరాయలు సహజంగా కవి, పండితుడు, నాట్యకళాకారుడు. అటువంటి రఘునాధుడు ఆమెకు అగ్రతాంబూలం ఈయటం ఆమెను ప్రత్యేకంగా గౌరవించడం ఇవి అపూర్వమయిన విషయాలు, ఆమె చరిత్రనాట్య కళారంగానికే గర్వకారణం.

ఇక గోల్కొండ నవాబుల కాలంలో మన సంస్కృతిసాహిత్యాలు అభిమానించే తానీషా ఆస్థానంలోని ప్రసిద్ధ నర్తకీమణి భాగ్యమతి. అందంలో ఆమెకు ఆమె సాటి. నాట్యంలో గొప్పపండితురాలు. వారు ముగ్గురు అక్కచెల్లెళ్ళు. భాగామతి, భాగ్యమతి, భాగీరథి. వీరు ముగ్గురూ నాట్యకళాకారిణులే. వీరిలో భాగ్యమతి అందచందాలకు, నాట్యకళా ప్రతిభకు ముగ్ధుడయిన తానీషా ప్రభువు ఆమెను హిందూధర్మశాస్త్ర పద్ధతిలో వివాహం చేసుకొన్నాడు. ఆమెకొరకు నిర్మించిన నివాసం నుండి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన వంతెనపై నుండి నాట్యం చేస్తూ ఆస్థానం చేరి, ఆస్థానంలోని పండిత పామరులను తన నాట్య విన్యాసాలతో మెప్పించి తిరిగి ఆ వంతెన మీదుగానే తన నివాసం చేరేది ఆ నర్తకీమణి. అంతటి ప్రతిభా విశేషాలు గలిగిన నర్తకి గనుకనే ఆమె పేరుమీదనే భాగ్యనగరం నిర్మించబడింది. అదే నేటి మన ఆంధ్రరాష్ట్ర రాజధాని హైదరాబాద్ ఇన్ని శతాబ్దాల తరువాత కూడా ఆమె పేరు చిరస్థాయిగా నిలిచి ఉండేలా ఒక మహానగరాన్నే నిర్మింపజేసుకొన్న ఆ నర్తకి జీవితం ధన్యం. నాట్యకళాలోకం గర్వించదగ్గ ఆస్థాననర్తకి భాగ్యమతి. భాగ్యనగరం నిలిచి ఉన్నంత కాలం భాగ్యమతి పేరు చిరస్థాయిగా ఉంటుంది. నాట్యకళాకారుల కీర్తికిరీటానికి ఈమె కలికి తురాయిగా అభివర్ణించడంలో అతిశయోక్తి లేదు.

ఇలా కాకతీయుల నాటి మాచల్దేవి. తన వంశచరిత్రనే రచింపజేసి, యక్షగానంగా నర్తింపజేసి చూసి ఆనందించిన ఘనురాలు. రెడ్డిరాజుల కాలంలో లకుమాదేవి ఆస్థాననర్తకిగా అలరించి కుమరగిరి రెడ్డిరాజుకు స్ఫూర్తిగా నిలిచి అతడిచేత "వసంతరాజీయం" అనే నాట్యశాస్త్రగ్రంథం రచింపజేసింది. ఇలా ఎందరో ఆస్థాన నర్తకీమణులు తమ జీవితాలను పూలబాటలోనడిపిస్తూ - మనస్సులను ముళ్ళబాటపై ప్రయాణం చేయిస్తూ, మనకోసం, మన జాతికోసం, మన నృత్యకళా వికాశం కోసం, మన నృత్యకళల అభివృద్ధికోసం తమ జీవితాలను అర్పించి నాట్యకళాలోకానికి ఎనలేని సేవచేసి ఖ్యాతి నార్జించిపెట్టారు.

ప్రతి నాట్యకళాకారుడూ ఆ స్త్రీమూర్తులను ఆరాధించాలి
ప్రతి రసహృదయుడూ ఆ స్త్రీకళాసాంప్రదాయాలను అభిమానించాలి
ప్రతి కళాహృదయుడూ వారికి జోహార్లు అర్పించాలి.



# అష్టదిక్పాలకుల ఆరాధన

ఆలయంలో ప్రతిష్ఠింపబడిన స్వామివారి పూజానంతరం ప్రతిదినం మంగళవాయిద్యాలతో అష్టదిక్కులలో గర్భగుడి చుట్టూ ప్రతిష్ఠితమయిన అష్టదిక్పాలకుల పీఠాలవద్ద వారికిష్టమయిన రాగం ఆలపిస్తూ, వారికిష్టమయిన తాళంలో నర్తించి నృత్యపూజ చేయడం ఆచారం. నృత్యారాధన అనంతరం నైవేద్యం సమర్పించి అష్టదిక్పాలకుల ఆరాధనం చేసి ప్రదాన దేవతను అష్టదిక్పాలకులకు అప్పగించి ఆరాధన ముగిస్తారు. మరల గర్భగుడిలో దేవుని ఎదుట కేళికజరిపి నృత్యపూజ ముగించటం పూర్వకాలం నుండి ఆగమశాస్త్రాన్ని అనుసరించి జరుగుతున్న నిత్యకృత్యం. ఈ అష్టదిక్పాలకుల ఆరాధన హైందవసాంప్రదాయంలో అతి ముఖ్యమయిన పూజావిధానం.

ప్రస్తుతం కొన్ని సంవత్సరాలుగా ఆలయాలలో ఈ నృత్యపూజ జరుగని కారణంగా మన నాట్యకళాకారులకు చాలామందికీ అష్టదిక్పాలకుల ఆరాధన నృత్యవిధానం తెలియదు సరిగదా అసలలాంటి నృత్యాలు ఉన్నాయనే విషయమే తెలియదు. తెలిసినా ఆ నృత్యాలు ఎలా చేయాలో, ఏ దేవునికి ఏ రాగంలో పాడాలో ఏతాళంలో నర్తించాలో తెలియని పరిస్థితి ప్రస్తుతం ఉంది. కారణం ప్రస్తుతం ఆలయాలలో ఈ విద్య తెలిసిన, నర్తించిన ఆలయన ర్తకీమణులు లేరు. పూర్వం ప్రతి ఆలయంలోనూ తప్పనిసరిగా ఒకరుగాని, అంతకు మించిగానీ ఆలయన ర్తకీమణులు ఉండేవారు. ఆమె ప్రతి సంధ్యలోనూ సూర్యుని యొక్క బంగారు కిరణాలు ఆలయ శిఖరంపైబడి, ఆశిఖరాలు బంగారు కాంతులతో మిల మిల మెరిసిపోతూ భక్తులకు స్వాగతం చెప్పే తరుణంలో దేవాలయాంతర్భాగంలో పుష్పాంజలి ఘటించేది ఆలయన ర్తకి. నృత్యపూజ లేని దేవాలయం ఉండేదికాదు. నృత్యకళాకారులు లేని దేవాలయం దేవుడులేని దేవాలయంతో సమానంగా చూడబడేది పూర్వం. మనకు మూడు దేవతాసాంప్రదాయాలున్నాయి.

1. వైష్ణవసాంప్రదాయం :- విష్ణుమూర్తికి సంభందించిన ఆలయాలు, ఆ ఆలయాలలో విష్ణు ప్రీతికరమయిన వర్తనలు, అభినయప్రాధాన్యం గల్గిన నృత్యప్రదర్శనం. కారణం విష్ణువు అభినయ ప్రియుడు

2. శైవసాంప్రదాయం :- పరమ శివునికి సంభందించిన ఆలయాలు. ఆ ఆలయాలలో శివప్రీతికరమయిన నర్తనాలు, తాండవ విన్యాసాలు, శివుని సప్తతాండవాల ప్రదర్శనం. కారణం శివుడు తాండవ నృత్యవినోది.

3. శాక్తేయం :- జగన్మాత అయిన పార్వతిదేవికి సంభందించిన నృత్యాలు, ఈ ఆలయాలు కొన్నింటిలో తాండవం ప్రదానంగా నర్తిస్తే, కొన్నింటిలో లాస్యం అగ్రగామి అయ్యింది. కారణం పార్వతీదేవి లాస్య విన్యాస వినోదిని.

ఈ మూడు రకాల ఆలయాలలో కూడా ఆ దేవునికి సంబంధించిన నృత్యాలతో పూజావిధిగా నిర్వహింపబడింది. ఈనాటికి మనం నర్తిస్తున్న అనేక నర్తనాంశాలు ఆనాడు ఆలయాల్లో నర్తించినవే. పర్వదినాలలో ఆలయం చుట్టూ ప్రదక్షిణం చేస్తూ ఎనిమిది దిక్కులలో ప్రతిష్ఠింపబడిన అష్టదిక్పాలకుల ఆరాధనం చేస్తూ నృత్యం ఆడేవారు. అష్టదిక్పాలకుల ప్రీత్యర్థం నర్తింపబడే ఈ నర్తన విన్యాసాలకు "నవసంధి" లేక "బలిహరణం" అని పేర్లుండేవి. ఈ నృత్యాలన్నీ ప్రత్యేకమయినవి. ఒకో దేవతకు ఒకో రాగంలో ఒకో తాళంలో. ఒకో విధంగా ప్రత్యేకమయిన రాగతాళవిన్యాసాలతో ప్రదర్శితమయ్యేది ఈ ఆరాధనా నృత్యసరళి.

ఆలయంలో స్వామికి పుష్పాలతో పుష్పాంజలి ఘటించిన పిదప ముందుగా ఆది నాయకుడయిన వినాయకునికి, కుమారస్వామికీ వారికిష్టమయిన నృత్యం ఆడి, అనంతరం ధ్వజస్తంభం వద్ద ఇంద్రుని ఆరాధనంతో అష్టదిక్పాలకుల ఆరాధనా నృత్యవిధానం ప్రారంభం అయ్యేది.



---

## 1. ఇంద్రదేవ ఆరాధనం

అష్టదిక్పాలకులలో మొదటివాడు ఇంద్రుడు.

ఇంద్రుని ఆరాధనంతో ప్రారంభం అయ్యింది బలిహరణం.

ఇంద్రుడు తూర్పు దిక్కుకు అధిపతి, అతడి వాహనం తెల్లని ఏనుగు అయిరావతం. ఆయన వజ్రాయుధాన్ని ధరించి భార్యా సచీదేవితో కూడి అమరావతి పట్టణాన్ని ఏలే అమరేంద్రుడీయన, సురులకు అధిపతి అయిన ఇంద్రునికి వేయికన్నులు. ఇంద్రునికి ప్రియమయిన నాట్యం లలితం. ప్రియమైన రాగం దేవగాంధారిలో గజలీలా, సమతాళంలో నృత్యపూజ జరపాలి.

## 2. అగ్ని దేవారాధనం

రెండవవాడు అగ్ని దేవుడు.

ఈయన ఆగ్నేయ మూలకు అధిపతి.

మేక వాహనంపై. భార్య స్వాహాదేవితో కూడి శక్తి ఆయుధంతో తేజోవతి పాలిస్తాడు. ఇతనికి సింహనాద వాయిద్యం వాయిస్తూ-కళింగ నృత్యాన్ని నాటిరాగం వర్తిస్తే ఇతడు కరుణిస్తాడని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.



# 3. సమవర్తి ఆరాధనం

మూడవ దేవుడు యమధర్మరాజు.

ఈయన దక్షిణాధీశుడు

ఎనుభోతు వాహనధారియై దృఢమయిన దేహంగల్గిన దేవుడు గదాధండంతో, భార్య శ్యామలాదేవితో గూడి నరకాన్ని పరిపాలిస్తాడీయన.

కర్తరీనృత్యం, మలహరిరాగం ఆలపిస్తూ - రాజచూడామణి తాళంలో నృత్యారాధనం చేయాలి.



# 4. నైరుతి నృత్యారాధనం

అష్టదిక్పాలకులలో నాల్గవవాడు నైరుతీ ప్రభువు.

భార్య దీర్ఘాదేవితో గూడి, నరునిపై ఎక్కి, కృష్ణాంగనా పట్టణాన్ని పరిపాలిస్తాడీయన,

విదృత నృత్యం, భైరవిరాగంలో రంగప్రదీపతాళంలో నృత్యం నర్తించి ఈయనను ప్రార్థిస్తే ప్రసన్నుడవుతాడు, ఈయనను ఆహ్వానించే సమయంలో విజయానంద వాయిద్యం వాయించాలి.



# 5. వరుణారాధనం

వశ్చిమాన్ని పాలించే ప్రభువు వరుణదేవుడు.

వర్షాలు సక్రమంగా కురిపించి, భూమిని సశ్యశ్యామలంజేయమని వరుణదేవుని ప్రార్థిస్తారు.

మొసలి వాహనంపై తిరుగుతూ, కౌశికాదేవికి భర్తయైన ఈతడు శద్దావతి పట్టణానికి రాజు.

ఉత్సంగ నర్తనాన్ని మేఘరంజని రాగం. మకరందతాళంలో ప్రదర్శిస్తే ఈయన కరుణిస్తాడు.

మంగళవాయిద్యం వాయిస్తూ ఈయనను ప్రసన్నం చేసుకోవాలి.

# 6. వాయుదేవ ఆరాధనం

ఇక అష్టదిక్పాలకులలో ఆరవవాడు వాయుదేవుడు.

వాయువ్య దిశాధిపతి, చక్కని కన్నులు గల్గిన లేడి ఈయన వాహనం. ధ్వజం ధరించి అంజనాదేవి సమేతుడై గంధవతి పట్టణాన్ని పరిపాలించే రాజు ఈయనే.

సృష్టిలోని ప్రాణుల జీవనాధారమయిన ప్రాణవాయువును అందించే దేవుడు ఈ వాయుదేవుడు సువ్యాపగ నాట్యాన్ని, వసంతగౌళరాగంలో విజయతాళంలో ప్రదర్శిస్తూ - గంభీరానంద వాయిద్యం వాయిస్తే ఈ వాయుదేవుడు ప్రసన్నుడవుతాడు.

# 7. కుబేరారాధనం

ఉత్తరదిశకు అధిపతి కుబేరుడు.

దేవతలకే అప్పులీయగల ధనమున్న దేవుడు.!

అశ్వవాహనారూఢుడై, అలకాపురిని పాలించే ఐశ్వర్యవంతుడీ కుబేరుడు. ఖడ్గంచేత భూని, భార్య చిత్రలేఖతో సుఖిస్తాడీయన. సంకీర్ణనర్తనం, శ్రీరాగం ఆలపిస్తూ - తురంగ లీలా తాళంలోనర్తిస్తే-సుసంపాత వాయిద్యం వాయిస్తే ఈయన ప్రసన్నుడవుతాడని ప్రతీతి.



# 8. ఈశాన్యప్రభు ఆరాధనం

అష్టదిక్పాలకులలో ఆఖరువాడు ఈశాన్యప్రభువు.

ఈయన ప్రాణుల అంత్యదశకు మూలపురుషుడు. సృష్టిని తనలో కలుపుకొనే ఈశాన్యాధీశుడు ఈయనే. వృషభవాహనంపై యశోవతి పట్టణాన్ని భార్య పార్వతీదేవితో త్రిశూలధారియై పరిపాలిస్తారు.

ధండపాద నృత్యాన్ని శంకరాభరణ రాగంలో నందలీలా తాళంలో ప్రదర్శించాలి. మాతృకానంద వాయిద్యాన్ని వాయిస్తే ప్రసన్నుడవుతాడు ఈశాన్యప్రభువు.

ఇలా ఒకో దేవుడిని అష్టదిక్కులలో పూజించి, తిరిగి గర్భగుడిలో మంగళ హారతులతో స్వామిని నిద్రపుచ్చి, గర్భగుడి ద్వారాలు మూసి వేస్తారు.

ఒకో దేవతకూ ఒకో నైవేద్యం. ఒకో రకం పూలతో పూజించాలి. ఈవిధంగా ప్రతి ఆలయంలో అష్టదిక్పాలకుల ఆరాధన గావించబడేది పూర్వకాలంలో. ఈ సాంప్రదాయాలు వెలికితెచ్చి, మరలా దేవాలయాల్లో నృత్యపూజ జరిపించిననాడు మన హైందవులకు ఆరాధనాక్రమం తెలియడమేగాక, హైందవధర్మం దశదిశలు వ్యాప్తి చెందుతుంది. పది కాలాలు హైందవధర్మం పచ్చగా నిలుస్తుంది.

# శివతాండవం

మహానటుడయిన సాంబసదాశివుడు తాండవానికి ఆదిపురుషుడు. ఆయన ప్రతి సంధ్యా సమయంలోనూ తాండవం ఆడేవాడు. వివిధ రకాల గతులలో ఆయన నర్తించే తాండవాలను ఏడు రకాలుగా విభజించారు పెద్దలు. అవే సప్తతాండవాలు. అసలు ఈ తాండవానికి "తాండవం" అనేపేరు ఎలా వచ్చిందంటే రేచక, అంగాహార, పిండీ బంధములను సృష్టించి ప్రయోగించిన శివుడు వాటిని తన శిష్యుడయిన తండునికి ప్రసాదించాడు. వానితో అతడు ప్రయోగం సృష్టించాడు. శివుని ముందు నర్తించాడు. అది చూసి సంతోషించిన శివుడు గీత ప్రయోగాన్ని ఆశ్రయించి ఈ నృత్యాన్ని నర్తించమని ఆదేశించాడు. అప్పుడు, తండుడు దీనికి గాన వాయిద్యములు చేర్చి ప్రయోగం చేశాడు. అలా తొలిసారిగా తండునిచే ప్రయోగింపబడినది కాబట్టి "తాండవం" అనే పేరు నిలిచింది. నృత్తసృష్టికర్త శివుడు. శివుడే నటరాజుగా, నాట్యాధిదేవునిగా ప్రసిద్ధుడు. శివునిచే సృష్టించబడి తండునిచే ప్రయోగింపబడినది కాబట్టి ఈ నృత్య ప్రయోగమునకు "శివతాండవం" అనే పేరు వచ్చింది.

బ్రహ్మదేవుని నుండి నాట్యం అభ్యసించిన భరతుడు శివునిముందు నాట్యం చేశాడు. ఆయన నాట్యకళావిన్యాసాలను మెచ్చిన పార్వతీపతి భరతుని నాట్యకళలో తాండవవిన్యాసాలు లోపించడం గ్రహించి తన ప్రమధగణాలలో ఒకడయిన తండుని పిలిచి అతనిచేత భరతునికి తాండవవిన్యాసాలను నేర్పించాడు. నందీశ్వరునికే మరోపేరు తండుడని నాట్యశాస్త్రంలో భరతముని చెప్పాడు. తండుడు భరతునికి 32 అంగాహారాలు, 108 కరణములను బోధించాడు. యీ తాండవవిన్యాసాలు ఏ నాట్యకళాకారుడు ప్రయోగించినా ప్రదర్శించినా యీ 108 కరణములతో కూడినదే అయ్యి ఉంటుంది. ఆనాటినుండి యీనాటి వరకూ యీ 108 కరణములు చెక్కిన శిల్పాలు శ్రీ చిదంబర నటరాజు స్వామి ఆలయంలో యీ నాటికి మనకు నిలిచి ఉన్నాయి.

లయకారకుడయిన శివుడు, పలుసందర్భాలలో వివిధ మనః ప్రవృత్తులతో నర్తించిన తాండవ నృత్యశోభనే సప్తతాండవాలుగా వర్ణించారు.

ఇవి వరుసగా ఇలా ప్రసిద్ధి పొందాయి.

1. ఆనంద తాండవం
2. సంధ్యా తాండవం
3. కలిక తాండవం
4. విజయ తాండవం
5. ఊర్ధ్వ తాండవం
6. ఉమా తాండవం
7. సంహార తాండవం

# 1. ఆనంద తాండవం

ఆనంద తాండవం అంటే ఆ పేరులోనే దాని అర్థం అగుపిస్తుంది. సృష్టి, స్థితి, లయ, అనుగ్రహం, తిరోదానం ఇలా పంచనృత్యములు ఈ తాండవ ప్రక్రియలో వివరించ బడినవి. పరబ్రహ్మ స్వరూపుడగు పంచముఖ శివుని ముఖములలో

ఈశాన్యం నుండి పరమాత్మ
తత్పురుష ముఖం నుండి జీవాత్మ
అఘోర ముఖం నుండి అగ్ని
వామదేవ ముఖం నుండి నీరు
సద్యోజాత ముఖం నుండి పృథ్వి పుట్టినవి.

ఇవి ఆధారంగా చేసికొని భూమిపై జీవించే భక్తులను అనుగ్రహించడానికి పరమేశ్వరుడయిన నటరాజు సలిపే తాండవమే ఆనంద తాండవం. ఆనందంగా నవ్వులు చిందిస్తూ, శృంగారభావం నేత్రాలలో కదలాడుతుండగా, వికశించిన పద్మంవంటి ముఖసౌందర్యంతో, అభయ, వరద హస్తములుపట్టి సమపాద, స్థానకములలో నాట్యం సల్పే తాండవవిన్యాసమే ఆనందతాండవం మార్కండేయ రక్షణ, అర్జున పాశుపతాస్త్ర ప్రదానం సమయంలో యీ తాండవం చేసాడా ఆనందతాండవ మూర్తి. యీ తాండవానికే నటరాజ తాండవం అని కూడా పేరు వాడుకలో ఉంది.



# 2. సంధ్యాతాండవం

ప్రతి సంధ్యా సమయంలోనూ అస్తమిస్తున్న సూర్యుని యొక్క బంగారు కిరణాలు తెల్లని మంచుతో నిండిన నిండైన ఆ కైలాస శిఖరం పైపడి ఆ శిఖరం బంగారు కాంతులతో మిలమిల, తళతళ మెఱిశిపోతున్న సమయంలో ప్రకృతి అందాలను చూసి పరవశించిన ప్రకృతిమాత పార్వతి, శివుని తాండవం చేయమని అడిగింది. అప్పుడు శివుడు ఆనందంతో ఆ అందమయిన సంధ్యలో తాండవం చేశాడు. ఆ తాండవ విన్యాసాలకే సంధ్యాతాండవం అని పేరు.

నాట్యాధి దేవుడయిన నటరాజు ఆ సంధ్యా సమయంలో సంధ్యాతాండవం ప్రదర్శించే సమయంలో బ్రహ్మదేవుడు తాళంవేసేవాడు. శ్రీమహావిష్ణువు మృదంగ శబ్దాలను పలికించే వాడు, దేవతల అధిపతి ఇంద్రుడు వేణువు నూదేవాడు. చదువుల తల్లి సరస్వతీదేవి వీణ వాయించేది. శ్రీమహాలక్ష్మిదేవి శ్రావ్యమయిన కంఠంతో పాటపాడేది. తుంబుర, నారదులు వంతపాట పాడేవారు. ఇక ఇతర మునిగణాలు, ప్రమథగణాలు, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషులు, దేవతలు, దానవులు, అప్సరభామినులు, కన్నుల పండుగయిన ఆ సంధ్యా తాండవం చూసేవారు. పార్వతీదేవి నవరత్న ఖచిత సింహాసనంపై కూర్చొని ఆనందంగా ఆ సుకుమార లలిత కోమలమయిన నటరాజస్వామి నర్తించే సంద్యా తాండవవిన్యాసాలను చూస్తు ఆనందించేది.

అందుకే పరమ శివుని "సంధ్యాతాండవమూర్తి" అంటారు.

# 3. కలిక తాండవం

ఈ విశాల విశ్వంలో జీవించే మానవులలోని అజ్ఞానం, అవినీతి మొదలగు దుష్ట శక్తులను హతమార్చి, జ్ఞానజ్యోతి వెలిగించి తమ బుద్ధి కుశలతలను పెంపొందించేలా చేసి కొమ్మని తెలిపే తాండవ విన్యాసమే "కలిక తాండవం"

ప్రతి జీవి తనలోని ఇమిడిఉన్న శక్తిని గ్రహించి, ఎలాంటి పనులయిననూ సాధిస్తున్నవి. ప్రకృతి విరాట్ స్వరూపమయిన పురుషుని యందు ఇమిడిఉన్న శక్తియొక్క తాండవ స్వరూపమే ఈ కలిక తాండవం. ఈ కలిక తాండవమునే శక్తి తాండవం అని కూడా అంటారు.

సూర్యుని తేజోమయ శక్తి, చంద్రుని యందలి శీతలకిరణ సంయోగశక్తి, ఇలా ఎన్నో శక్తులున్నాయి ఈ విశాలమయిన వింతసృష్టిలో. ఆశక్తులను సూచించే తాండవమే శక్తితాండవము. ఇందులో వీర, రౌద్ర, భయానక రసములు పూర్తివికాశం పొందుతున్నవి.



# 4. విజయ తాండవం

ప్రపంచంలోని ప్రశాంతతకు భంగం కల్గించేలా కొందరు మునులు గర్వంతో తమ మంత్ర శక్తులను ఉపయోగించేవారు. వారి గర్వాన్ని అణచి, వారిని సాధు స్వరూపులుగా చేయడానికి శివుడు మునిపుంగవుని రూపంలో వారు నివశించే అరణ్య ప్రాంతానికి వెళ్ళాడు. అప్పటికి వారు యజ్ఞం చేస్తున్నారు. మునిరూపంలో ఉన్న శివుడు గర్వమధాందులయిన ఆ మునులనందరినీ ఓడించాడు. అది చూసి ఓర్వలేని మునులు మునివేషంలో ఉన్నది శివుడని గ్రహించక అతడిని నాశనం చేయాలనే తలంపుతో వారు చేస్తున్న యజ్ఞకుండం నుండి ఒక మహావ్యాగ్రాన్ని సృష్ఠించి శివునిపైకి పంపారు. శివుడాపులిని పట్టుకొని తన చిటికెన వేలితో దాని చర్మాన్ని ఒలిచి నడుముకు చుట్టుకొన్నాడు. అది చూసి ఆశ్చర్య పోయిన మునులు ఒక క్రూరమయన ఉరుగాన్ని సృష్టించారు. శివుడు దాన్ని మాలగా కంఠంనందు ధరించి నాట్యం ఆడాడు. ఇక ఆఖరు ప్రయత్నంగా తమ శక్తులన్నీ ఏకంచేసిన మునులు గజాసురుడనే దుష్టరాక్షసుడిని హోమగుండం నుండి సృష్టించి శివునిపైకి యుద్ధానికి పంపారు. శివుడు ఆ రాక్షసుడిని తన పాదాలతో తొక్కి అతడి వెన్నెముక విరిచి అతడి పైనే విజయ సూచకంగా తాండవం చేశాడు. మునుల గర్వమణగింది. తమ తప్పులు తెలుసు కొని మహానటునికి నమస్కరించి, క్షమాభిక్ష కోరారు. వారిని క్షమించి తాండవమాడాడు మహాదేవుడు. ఆనాడు శివుడు చేసిన తాండవమే విజయతాండవం. మునుల గర్వమణచి శివుడు చేసిన తాండవవిన్యాసాలు తిలకించిన దేవతలు ఆనందంతో పూలవానకురిపించారు.

# 5. ఊర్ధ్వ తాండవం

సృష్టికి మూలకారణభూతులయిన ఆది దంపతుల అంతఃకలహమే ఊర్ధ్వతాండవానికి కారణం అయింది. ప్రకృతి, పురుషులిరువురూ నాట్యంలో నేను గొప్ప అంటే నేను గొప్ప అని వాదులాడుకొన్నారు. కలహించుకొన్నారు. తాండవ విన్యాసాలలో శివుడు నిష్ణాతుడు అభినయంలో అంబను మించినవారులేరు. వీరిరువురి జగడం చిలికి చిలికి గాలివాన అయ్యింది వారి కలహం తీర్చడానికి దేవతలు, యక్షులు, గంధర్వులు, కిన్నెరులు, కింపురుషులు, ఋషులు, మునులు, ప్రమథగణాలు, భూతగణాలు, అందరూ కైలాసగిరి చేరారు. సభ ఏర్పాటయ్యింది. ఉమాశంకరు లిరువురూ నాట్యపోటీ ప్రారంభించారు. నాట్యంలో ఇరువురూ సమాన ప్రతిభా వంతులే ఒకరిని మించి ఒకరు నాట్యం ఆడుతున్నారు. ఎవ్వరూ ఓడిపోవడంలేదు న్యాయ నిర్ణయం ఎలా చేయాలో, విజేతగా ఎవరిని నిర్ణయించాలో ఎవరికీ అర్థంగావడంలేదు. సభలోని పెద్దలకు, న్యాయనిర్ణయం పెద్దసమస్య అయ్యింది.

అది గ్రహించిన శివుడు తెలివిగా సమయస్ఫూర్తితో ఒకకాలు తీసి తన శిరస్సుపై ఉంచుకొని, ఒంటికాలిమీద వికటంగా నాట్యం చేయడం ప్రారంభించాడు. పార్వతీదేవి స్త్రీమూర్తి గనుక నిండుసభలో అలా చేయలేక సిగ్గుపడి నాట్యం ఆడటం ఆపివేసింది. అంతే శివుడే గెలిచాడు. ''నటరాజు'' అయ్యాడు. అలా అతడు నర్తించిన నర్తనాన్ని ''ఊర్ధ్వ తాండవం'' అంటారు ఇది శివునికి అత్యంత ప్రీతి పాత్రమయిన నాట్యం.



# 6. ఉమా తాండవం

ఇక ఆరవ తాండవ విన్యాసం ఉమాతాండవం. పార్వతీ పరమేశ్వరులు భూత, ప్రేత, పిశాచగణాలతో కూడి నాట్యంసల్పేవారు. వారి నాట్య వేదిక స్మశాన వాటిక, చిటపట చిటపట మంటూ కాలే చితిమంటల కాంతిలో, బూడిద పూసుకొని శంకరుడు మేను మరచి పది చేతులతో, వివిధ భంగిమలతో, వీరభద్రునిగా, వీరభైరవునిగా నాట్యం చేస్తుంటే, ఉమాదేవి భైరవిగా, చండికగా అతడిని అనుసరించి నాట్యము చేసేది. వారిరువురూ నాట్యం ఆడుతుంటే చూసి ఆనందంగా తామూ నాట్యం చేసేవారు భూత, ప్రేత, పిశాచగణాలు చితిమంటలనుండి అప్పుడప్పుడే వెలికి వచ్చిన ప్రేతాత్మలు కూడా వారితో కలిసి నాట్యం ఆడేవి.

ఇలా కోలాహలంగా సాగే తాండవవిన్యాసమే ''ఉమాతాండవం''గా ప్రసిద్ధి పొందింది.

# 7. సంహార తాండవం

సప్తతాండవాలలో ఆఖరుదయిన సప్తమ తాండవవిన్యాసం సంహారతాండవం. త్రిపురాసురులనే రాక్షసులను చంపి ప్రళయ రుద్రునిగా మారిన శివుడు తాండవం చేస్తున్నాడు. చండీశ్వర, భద్రకాళి, కాళభైరవులు రుద్రుని అనుసరించి నాట్యం చేస్తున్నారు అనేక జీవన జ్యోతులు ఆ పరమ శివునిలో ఐక్యం అవుతున్నాయి. ఈ మాయా ప్రపంచంలో శరీరం శాశ్వతంగాదు. ఆత్మయే శాశ్వతం. ఏదీ నిత్యంగాదు. అన్ని అనిత్యాలే అనే సత్యాన్ని తెలిపే తాండవ ప్రక్రియ ఈ సంహారతాండవం.

పుట్టిన ప్రతి జీవి గిట్టికతప్పదు. గిట్టినవారు పరమేశ్వరునిలో లీనం అవ్వకాతప్పదు. అనే వేతాంతసారం ఈ తాండవలక్షణం. దేహంనిండా బూడిద, జడలు కట్టిన శిరోజాలాలతో, చంద్రశేఖరుడై పన్నాగభూషణాలు ధరించిన శివుడు పద్మాసనం వేసుకొని ధ్యానంలో నుండగా ఈ అనంతమయిన సృష్ఠి అంతా ఆయనలో లీనం అవుతుంది. జీవులు ప్రాపంచిక భాధలనుండి విముక్తి పొంది ఆయనలో కలియుచున్నారు.

లయకారకుడయిన శివుడు నర్తించే ఈ తాండవం "సంహారతాండవం"

ఇవిగాక, మరి ఏడు తాండవాలు కూడా ఉన్నాయి.

వాటినే శుద్ధతాండవాలు అంటారు.

అవి. శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖణ, దండిక, కుండలి, కలస తాండవాలు, ఇవి కూడా సప్తతాండవాలే.

ఇవిగాక పార్వతీదేవి నర్తించిన పంచతాండవ ప్రక్రియలున్నాయి.

అవి నికుంచిత, కుంచిత, అకుంచిత, పార్శ్వకుంచిత, అర్ధకుంచిత తాండవాలు. ఇవి గౌరీ తాండవాలుగా ప్రఖ్యాతి పొందాయి.

శివుడు మహానటునిగా, నాట్యాధి దేవునిగా, నటరాజ మూర్తిగా నర్తించే ఏ తాండవమయినా జనరంజకమే. ఈ తాండవాలు విస్తరిస్తే, విడదీస్తే ఎన్నో - ఎన్నెన్నో.

# భామాకలాపం

ఆంధ్రదేశంలో పుట్టిన ప్రతివారికి తెలిసిన నృత్యవిన్యాసం ఈ "భామాకలాపం"

సత్యభామా శ్రీకృష్ణుల ప్రణయకావ్యం ఈ భామాకలాపం. సిద్దేంద్రయోగిపుంగవుడు పారిజాతాపహరణం అనే నృత్యనాటకం రచించాడు. కూచిపూడి అగ్రహారంలోని బ్రాహ్మణ భాగవతులకు ఆ నృత్య నాటకం నేర్పాడు. వారిచే ప్రచారం చేయించాడు. ఆనాడు సిద్దేంద్రయోగి రచించిన పారిజాతాపహరణం అనే నృత్య నాటకంలోని ఒక ఘట్టాన్నే ఈనాడు భామాకలాప నర్తనంగా నర్తిస్తున్నారు. మన రాష్ట్రంలోనూ, ఇతర రాష్ట్రాలలోనే కాక. ఇతర దేశాలలోని అనేకమంది కళాభిమానులను ఆకర్షిస్తున్న ఏకైక నృత్యరాజం ఈ భామాకలాపం.

సిద్దేంద్రయోగి రచించిన భామాకలాపం కథను ఆధారంగా చేసుకొని ఇతరప్రాంతాలలోని అనేకమంది కవులు కలాపాలను రచించారు అందువల్లనే సిద్దేంద్రయోగి విరచితమయిన భామాకలాపం గాక ఇంకా ఆరు విధములయిన కలాపసాంప్రదాయాలు ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉన్నాయి. కొన్నింటిని భాగవత కళాకారులు నర్తిస్తే, కొన్నింటిని ఏకపాత్ర కేళికలు చేసే నర్తకీమణులు నర్తించారు. ఒకే నృత్య నాటకంలోని కథను ఆధారం చేసుకొని ఎంతోమంది కవులు నృత్యానికి, అభినయానికి సరిపడ రచించడం, ఆ రచనలను విశ్రుత అభినయాలతో ఎంతోమంది నర్తకీమణులు నర్తించడం, ఎందరో ప్రేక్షకులు ఆనాటి నుండి యీనాటివరకూ చూచి ఆనందించటం నిజంగా ఆంధ్రులు - ఆంధ్రకళాకారులు గర్వించదగ్గ విషయం. శ్రీ సిద్దేంద్రయోగి కవితామాధుర్యం, పాండిత్యప్రతిభ, రచనా వైదుష్యము. కళాప్రతిభ ఎట్టిదో, ఎంత గొప్పదో దీనిని బట్టి మనం గ్రహించవచ్చును. ఆంధ్రులు ఎంతగానో ఆ మహానుభావునికి ఋణపడి ఉన్నారనేది సత్యదూరంగాదు. ఈ సాంప్రదాయ నృత్యం మన ఆంధ్రావనిలో తప్ప, భారతావనిలో మరే ఇతర రాష్ట్రంలోగానీ, విదేశాలలోగానీ ఎక్కడా ప్రచారంలో లేదు. అసలు సత్యభామకు ఒక ప్రత్యేక స్థానం కల్పించి, ఆమె ఆధిక్యతను, ఆమె అందచందాలను, ఆమె గర్వాన్ని, వీరత్వాన్ని, పదహారు వేల గోపస్త్రీలలోనూ ఆమెకు గల ప్రత్యేకతను చాటిచెప్పి. ప్రత్యేక స్థానం కల్పించినది ఆంధ్రులే. ఉత్తర భారతంలో రాధాదేవిని, రుక్మిణీదేవిని శ్రీకృష్ణునితో సమానంగా పూజిస్తున్నా, ఆంధ్రులు మాత్రం సత్యాదేవికి అగ్రస్థానం ఆపాదించారు. అందుకే ఆమె ఆంధ్రుల ఆడపడుచు. ఆనాటి నుండి ఈనాటి వరకూ ఏనాటి కయినా ఆమె ఆంధ్రుల ఆడపడుచే. ఇది జగమెరిగిన సత్యం.

అష్టవిధనాయికల అభినయానికి అవకాశం కలిగి, నాయికలు, వారి చేష్టలు, వారి వారి వ్యాపార రసపోషణలకు అనుగుణంగా ప్రదర్శనకు వీలుగా పారిజాతాపహరణం అల్లినాడు

శ్రీ సిద్దేంద్రుడు, దాని సారాన్ని గ్రహించి ఒకే నర్తకుడు వివిధ రసములు అభినయిస్తూ నృత్త, నృత్యరీతులలో తనకు గల పాండిత్యం ప్రదర్శించుటకు అనువయిన రీతిలో ఆ నృత్యరూపకాన్ని కూచిపూడి భాగవత కళాకారులు ఒక స్వరూపమేర్పరచి భామాకలాపంగా ప్రచారం చేశారు. అసలు భామాకలాపంలోని కథా విధానం కేవలం ప్రణయ కలహం మాత్రమే.

ఒకనాడు పడకటింట్లో రాత్రి సమయంలో శ్రీకృష్ణుడు సత్యభామతో కూడి ఉన్నాడట. అప్పుడు శ్రీకృష్ణుడు సత్యభామను అందంగా అలంకరించుకొమ్మని, తానూ అలంకరించు కొని ఇరువురి ప్రతిబింబాలు నిలువుటద్దంలో చూపించి సత్యా నీవు అందంగా ఉన్నావా ? లేక నేను అందంగా ఉన్నానా ? అని ప్రశ్నించాడట.

సౌంధర్య గర్వీత, ప్రగల్భనాయిక అయిన మన సత్యభామ అహంకారంతో, అమాయికంగా నేనే అందంగా ఉన్నాను అని సమాధానం చెప్పింది, జగన్మోహనాకారు డయిన శ్రీకృష్ణునికి కోపం వచ్చింది. అలిగి ఆమె ఇంటినుండి వెళ్ళిపోయాడు. ఆనాటి నుండి ఆమె ఇంటికి రాలేదు శ్రీకృష్ణుడు, విరహమోర్వలేని సత్యభామ మాధవి అనే వార్తాహరుని ద్వారా శ్రీకృష్ణునికి లేఖ వ్రాసి పంపుతూ ఆమెకు తన విరహాన్ని తెల్పుతూ తన బాధంతా ఆమెకు వివరిస్తూ, తను చేసిన ఘనకార్యాలు, సాధించిన విజయాలు తెల్పుతూ, శ్రీకృష్ణుని తిరిగి తన యింటికి రప్పించుకోవడానికి సత్యభామచేసే హంగామయె ఈ "భామా కలాపం" నృత్య ప్రదర్శన సారాంశం.

ఈ కథను కూచిపూడి భాగవతులు మూడు రాత్రుల గ్రంథంగా ప్రదర్శిస్తే, తూర్పు గోదావరి జిల్లాకు చెందిన పిఠాపురం గ్రామంలోని పంచమాధవులలో ఒకరైన కుంతిమాధవ స్వామివారి దేవాలయంలో పెండేల సత్యభామ అనే కళాకారిణి తొమ్మిదిరాత్రుల గ్రంథంగా "నవజనార్ధన పారిజాతం" అనే పేరుతో నర్తించింది, ఈ గ్రంథాన్నే తూర్పుగోదావరి జిల్లాలో అనేకమంది నర్తకీమణులు నర్తించారు. నవ అంటే తొమ్మిది. తొమ్మిది రాత్రులు నర్తించేవారు కాబట్టి "నవజనార్ధం" అన్నారు. అంతేగాక నవ అంటే నూతనం నిత్యనూతన మయిన నాట్యప్రక్రియగాబట్టి నవజనార్ధనం అన్నారు. ఇలా ఎందరో కళాకారులు, కళాకారి ణులు ఈ భామాకలాపం అద్భుత రసాలతో నర్తించి ఆంధ్రుల నర్తన విన్యాసాలకు శోభను చేకూర్చి, ఆంధ్రుల ఆడపడుచు సత్యభామాదేవి అందాల్ని, గుణగణాల్ని లోకానికి చాటి చెప్పి. తాము పేరుప్రఖ్యాతులు గడించారు. గడిస్తున్నారింకా, దేశవిదేశాలలో ఆంధ్రులకు నృత్యకళలో ఒక ప్రత్యేక స్థానం కల్పించారు. కల్పిస్తున్నారింకా.

భామాకలాపం నర్తించే సమయంలో ధరించే జడకు కూడా ఒక విశిష్టమయినస్థానం అలంకరణలకు ప్రత్యేకత ఉన్నాయి. జడను గూర్చిన కథ తెలుసుకుందాం. పూర్వం

భామాకలాప ప్రదర్శనంలో భామకంటే ముందుగా తెల్లని తెరనుపట్టి తెరవెనుక భామపాత్ర దారి ఉండి తెరపై జడనువేసి ఆ జడను వర్ణిస్తారు. భామపాత్రధారి సకల విద్యలయందు పాండిత్యం గలవాడై ఉండాలి, సభలోని వారు ఎవరైనా తమ విద్యను పరిక్షించుకోవచ్చును. అని సవాల్ చేయడమే తెరపై ముందుగా జడను వేయడంలోని అంతరార్థం, సభలో పండితులుంటే వారితో తర్కించి, ఆ తర్కంలో భామ పాత్రధారి ఓడిపోతే ఆ జడను కత్తిరించి ఆ పండితుడు తీసికొనవచ్చును. అంటే జుత్తు కత్తిరించుకొన్నట్లే, ఇంతకంటే అవమానం వేరొకటి ఉండదుగదా, అయితే ఆ జడకుకూడా ఒక కథ ప్రచారంలో ఉంది. దేవదానవులు మందరగిరిని కవ్వంగా, ఆదిశేషుని త్రాడుగా చేసి పాలసముద్రాన్ని చిలికి నప్పుడు పుట్టిన అమృతం పంచడానికి శ్రీమహావిష్ణువు మోహినిగా అవతారం ఎత్తి దేవతలకు అమృతాన్ని అందించాడు ఆనాడు జగన్మోహినీ రూపంలో తాను ధరించిన జడను పార్వతీ దేవికి బహుమతిగా ఇవ్వబోగా పార్వతీదేవి యోగిపుంగవుడయిన శివుని భార్య గనుక ఆమె జడను ధరించలేదు. అదే జడను రుక్మిణికి ఇవ్వబోగా ఆమె కూడా అభ్యంతరం తెల్పింది. ఆ జడను ఒక సంధూకపెట్టెలో భద్రపరచి నరకాసురుని వధించిన వీరవారి సత్యాభామాదేవి ధైర్యసాహసాలకు, ఆ యుద్ధంలో ఆమె చేసిన సహాయానికి ఆనందించిన శ్రీకృష్ణుడు సత్యభామకు ఆ జడను బహుమతిగా ఇచ్చాడు. ఆనాటి నుండి సత్యభామ అలంకారంగా. ఆ జడను ధరించింది.



# కూచిపూడి నాట్యం

ఆంధ్రదేశంలో అతి పవిత్రమయిన కృష్ణానదీతీరంలో పుట్టి ఆంధ్రుల సాహిత్యంలో, అభినయంలో చోటు చేసుకొని ఈనాడు ప్రపంచం అంతటా నిండిపోయిన ఒక అపూర్వ మయిన నాట్యప్రక్రియ కూచిపూడి నాట్యం. ఈనాడు కూచిపూడి నాట్యం పేరు విననివారుండరు. చిన్నలనుండి వృద్ధులవరకూ అందరూ ఎరిగిన తెలుగువారి ఏకైక నాట్యసాంప్రదాయం కూచిపూడి నాట్యం. అసలు కూచిపూడి నాట్యం అనే పేరు ఎందుకు వచ్చిందంటే - కృష్ణా జిల్లాలోని కూచిపూడి గ్రామంలో జన్మించిన బ్రాహ్మణులు అందరూ వేరే వృత్తిని స్వీకరించక కేవలం నాట్యప్రదర్శనలపైనే జీవితాల్ని గడుపుతూ నాట్యాన్ని ప్రచారం చేశారు. పదకవితా పితామహుడయిన మహాకవి క్షేత్రయ్య జన్మించిన "మొవ్వ" గ్రామానికి రెండుమైళ్ళదూరాన ఉంది ఈ కూచిపూడి అగ్రహారం.

చరిత్రలో క్రీ॥ శ॥ 1500 నాటికే కూచిపూడి భాగవతులు సుప్రసిద్ధులయినారని తెలుస్తోంది. కూచిపూడి భాగవతుల ప్రశక్తి ప్రథమముగా మాచుపల్లి కైఫియతునందుగలదు. విజయనగర సామ్రాజ్యాధినేత అయిన శ్రీకృష్ణదేవరాయలవారి సవతి అన్నగారైన వీరనర శింగరాయల కాలంలో విజయనగరమున కూచిపూడి భాగవతులు కేళిక ప్రదర్శించినట్లు తెలియుచున్నది.

గుండికట్ల, బండ్లికొమ్ము సర్దారు అయిన తాతగురవరాజు అని పిలువబడే సంబెట గురవరాజు అనే సామంతుడు తన రాజ్యప్రజలను అతిధారుణంగా శిక్షించేవాడు. అతిక్రూరు డయిన సంబెట గురవరాజు పన్నులు సరిగా కట్టని పేదప్రజానీకపువారి స్త్రీలను తీసుకవచ్చి బహిరంగంగా వారి స్థనాలకు చిరుతలు పట్టించి హింసించేవాడు (రెండుకర్రలను తీసుకొని, ఆ రెండు కర్రలనూ ఒక చివరచేర్చి కట్టివేసి, రెండవప్రక్క కొనలను విడదీసి ఆ రెండు కర్రలసందున చేతివ్రేళ్ళనూ, ఆడవారి స్థనాల చివరలనూ అదకత్తెరలో ఒత్తినట్లు ఒత్తుటనే చిరుతలు పట్టించడం అంటారు.)

అటువంటి రోజులలో కూచిపూడి గ్రామం నుండి భాగవతులు ఊరూరా తిరిగి పంచారం చేస్తూ రాత్రివేళలలో నాలుగుదారుల కూడలిలో ప్రదర్శనలు చేస్తూ, మాచుపల్లి సమీపంలో విడిదిచేసి సంబెట గురవరాజుయొక్క దుశ్చర్యల గూర్చి తెలుసుకొని, అక్కడి నుండి విజయనగరం వెళ్ళి, శ్రీ వీరనరశింగరాయల ఆస్థానంలో గురవరాజు వేషం ఒకరు, ఇద్దరు సైనికుల వేషాలు ధరించి, అతడు స్త్రీలను హింసించడం, వారి స్థనాలకు చిరుతలు పట్టించడం, తదితర దుశ్చర్యలు భాగవతం ఆడి నర్తించారు. అప్పుడు నరశింగరాయప్రభువు

ఇది ఏమిటని అడుగగా, సిద్దవటం సంబెట గురవరాజు అనే సామంతుడు చేస్తున్న దుశ్చర్యలు అని, వాటిని మీ దృష్టికి తీసుకరావడానికే ఈ విధంగా ప్రదర్శించామని తెలిపారు. వీరనరశింగరాయలు మరునాటి ఉదయం తనకు ఈ విషయాన్ని గుర్తుచేయమని పరివారానికి తెల్పి భాగవతులను సత్కరించి పంపివేశాడు. మరునాడు పరివారం గుర్తుచేయగా సైన్యం సిద్ధంచేసి ఇస్మయేలు ఖాన్ అనే మహ్మదీయ సర్దారును పంపి సంబెట గురవరాజు తల కొట్టించి, ఆ రాజ్యప్రజలను కష్టాలనుండి గట్టెక్కించాడు. ఆ రాజ్యప్రజల కష్టాలు తీరేందుకు కారకులు మన కూచిపూడి భాగవతులు. ఈ విధంగా చరిత్రలో 15వ శతాబ్ధంలో కూచిపూడి భాగవతులను గూర్చిన ప్రసక్తి ఉంది.

కూచిపూడి భాగవతులు సంచారులు. భాగవత కళనే జీవనోపాధిగా ఎంచి ఊరూరా తిరుగుతూ రాత్రి సమయాలలో నాలుగు వీధుల కూడలిలో వేదిక నిర్మించి, ఆ రంగస్థలంపై కొబ్బరి, అరటి ఆకుల అలంకరణలు చేసి, మామిడి తోరణాలు కట్టి, అనంతరం ప్రదర్శనం చేసేవారు ఇది ప్రాచీనకాలం నాటి కూచిపూడి భాగవతుల సాంప్రదాయం.

అసలు కూచిపూడి భాగవతులు జగత్ప్రసిద్ధి పొందుటకు కారకులు యతినారాయణ తీర్థులవారి శిష్యుడయిన మహాయోగిపుంగవుడు శ్రీ సిద్దేంద్రుడు. ఈయనే తొలిప్రబంధ కావ్యాన్ని తెలుగులో రచించి సత్యభామా శ్రీకృష్ణుల ప్రణయకలహాన్ని పారిజాతాపహరణం అనే యక్షగానంగా తీర్చిదిద్ది, కూచిపూడి భాగవతులకు నేర్పాడు. అందలిజతులు, చారీభేద ములు, పాదగతులు, ప్రవేశదరువుల పద్ధతి, నాట్యంతీరు, పాత్రపోషణ, అభినయవిధానం నిర్దుష్టంచేసి ఆంధ్రదేశం అంతటా ప్రచారం కొరకై తన శిష్యులయిన కూచిపూడి భాగవతు లను పంపాడు. సిద్దేంద్రయోగి లేకుంటే అసలు కూచిపూడి యక్షగానం లేదనేది జగ మెరిగిన సత్యం.

అందుకే "ఘనుడగు సిద్దేంద్రయోగి కవితారచనన్" అని భామాకలాపంలో కీర్తిస్తారు. సిద్దేంద్రుడు రచించిన పారిజాతాపహరణం అనే నృత్యకావ్యంనుండి భామాకలాపాన్ని వేరుచేసి నర్తిస్తున్నారీనాడు.

అసలు భామాకలాపం అంటే ఏమిటి ?

శ్రీకృష్ణుని అష్టభార్యలలో అగ్రగామిగా తన అందంతో, ఐశ్వరంతోనూ, జగ ములు నేలే స్వామినే తన పాదదాసునిగా చేసుకొన్న సత్యభామయొక్క విరహవేదనే ఈ భామాకలాపం. సత్యభామ ప్రగల్భనాయిక. సౌందర్య గర్వితఅయిన సత్యాదేవిని ఆంధ్రుల ఆడపడుచుగా లోకానికి చాటిచెప్పి అపాత్రకొక విశిష్టత చేకూర్చిన ఖ్యాతి మన ఆంధ్రులకే దక్కింది. ఉత్తర హిందూదేశంలో రాధను, రుక్మిణీదేవిని కొలుస్తారు. కానీ మూడులోకాల

వానులు శ్రీకృష్ణుని పాదాలు వట్టుకపూజిస్తే, శ్రీకృష్ణుని శిరస్సునే తన సుకుమార పాదంతో తాడనంచేసిన సత్యభామను రూపొందించిన ఖ్యాతి ఆంధ్రులదే. అందుకే ఆమె ఆంధ్రుల ఆడపడుచు.

ఒకనాడు శ్రీకృష్ణుడు పడకటింట్లో నిద్రిస్తున్న సత్యభామను నిద్దురలేపి సర్వాలంకార ములు ధరింపజేసి, ఇరువురూ నిలువుటద్దంముందు నిల్చుని, వారిరువురి ప్రతిబింబాలనూ అద్దంలోచూస్తూ –

సత్యా! నీవు అందంగా ఉన్నావా? లేక నేను అందంగా ఉన్నానా? అని శ్రీకృష్ణుడు అడిగాడట.

సౌందర్య గర్విత అయిన సత్యభామ నేనే అందంగా ఉన్నానని అందిట. ఇంకే ముంది శ్రీకృష్ణునికి కోపంవచ్చి ఆమె మందిరం నుండి అలిగి వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిన శ్రీకృష్ణపరమాత్మను తన మందిరానికి తిరిగి రప్పించుకొనేందుకు సత్యభామ చేసిన చిన్నెలనే భామాకలాపం అంటారు.

భామనే సత్యాభామనే అంటూ ప్రవేశించిన భామపాత్ర మదనా మదనా అంటూ మదనుని కీర్తించి విరహం అభినయించి, తన గొప్పలను తెలిపి, స్వామి అందాలను వర్ణించి శ్రీకృష్ణునికి లేఖ వ్రాసి మాధవి అనే పండితుని ద్వారా రాయభారం పంపి శ్రీకృష్ణుని తన మందిరానికి రప్పించుకొంటుంది సత్యభామ. ఇది జగమెరిగిన కలాప నర్తనం. అసలు కూచిపూడి వారు వీధి భాగవతులు. పూర్వకాలంలో ప్రయాణ సౌకర్యాలు లేక ప్రయాణాలు చేయడం బహుకష్టము. దారిదోపిడులు తట్టుకొంటూ అరణ్యాలనడుమ ప్రయాణాలు చేయడం సంచారులయిన కూచిపూడి వారికి తప్పనిసరి.

అందుకే సిద్దేంద్రులవారు స్త్రీలకు భాగవతం చెప్పవద్దని ఆదేశించారు. అందువలన పురుషులే స్త్రీవేషం ధరించేవారు. ఉదా :- పారిజాతాపహరణం యక్షగానంలో కృష్ణుడూ, సత్యభామ, రుక్మిణి వంటి పాత్రలు ఒక్కొక్క పురుషుడు ఒక్కోపాత్ర ధరించి ఆడుతూ, పాడుతూ, అభినయిస్తూ ప్రేక్షకులను మెప్పించేవారు. ప్రదర్శనలో ముందుగా సూత్రధారుడు ప్రవేశించి కూచిపూడి భాగవత కళావిశిష్టతను తెలియపరచి పాత్రలను పరిచయం చేసిన అనంతరం పాత్రలు నర్తించేవి. ఈ యక్షగాన కళావిధానాన్ని చూసి 1575 సం॥లో కొత్త రక్కరరాజు మళయాళదేశంలో "కుడియాట్టము" అనే యక్షగానమును (కథకళి) అందించి నట్లు తెలుస్తోంది.

ఈనాటికీ ప్రపంచంలోని ఏ ప్రాంతంలో నివశించే కూచిపూడి కళాకారుడయినా ఆనాడు కూచిపూడి గ్రామంలో విద్య నేర్చుకొన్న వారి శిష్యుడుకానీ, ప్రశిష్యుడుగానీ అయ్యిఉండాలి సిందే. కూచిపూడి భాగవతులు సంగీతానికి మూలపురుషుడయిన నాదబ్రహ్మ శ్రీ త్యాగరాజ స్వామి ఎదుట యక్షగానం ప్రదర్శించి ఆయనచే ఒక రాగాన్ని బహుమతిగా పొందారు. ఆదిశంకరాచార్యుల వారి ఎదుట భాగవతం ఆడి "పరమ భాగవతులు"గా కీర్తింపబడ్డారు. అసలు కూచిపూడి వారందరూ ఒకే కుటుంబంలోని సభ్యులే. ఆంధ్రదేశాన్ని గోల్గొండ నవాబులు పరిపాలిస్తున్న కాలంలో ఆ నవాబులలో ఆఖరివాడయిన అబుల్ హసన్ తానీషా (క్రీ॥ శ॥ 1672 - క్రీ॥ శ॥ 1687) మంచి కళాకోవిధునిగా, కళాపోషకునిగా పేరు పొందాడు. అతడికి హిందువులంటే మిక్కిలి అభిమానం అందుకు ఎన్నోతార్కాణాలు ఉన్నాయి. అంతేగాక నాట్యకళంటే ప్రాణం. అందుకే ప్రముఖనర్తకి అయిన భాగామతిని వివాహం ఆడాడు. అంతేగాక ఆమెకు ప్రత్యేకంగా ఒక భవనం నిర్మించి ప్రతిదినం ఆమె తన నివాసం నుండి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన వంతెనగుండా సభను చేరే ఏర్పాటు చేశాడు. కాలుక్రింద పెట్టకుండా ఆమె సభను చేరేదన్నమాట. ఇలా ఎన్నో ప్రజాహితకార్యాలు చేసిన తానీషాప్రభువు కూచిపూడి భాగవతుల యక్షగానం చూసి వారు నివసిస్తున్న కూచిపూడి గ్రామాన్ని వేదాంతం, వెంపటి, హరిభాగవతుల, పసుమర్తి, జోస్యుల, మహంకాళి, ఏలేశ్వర కుటుంబీకుల వారికి చెందునట్లు కూచిపూడి అగ్రహారాన్ని దానమిచ్చాడు.

కూచిపూడి భాగవతుల ఆహార్యం విచిత్రంగా, కనువిందుగా ఉంటుంది. రాజువేషము నకు భుజకీర్తులు, కిరీటం ముప్పేట హారములు. స్త్రీ వేషమునకు చెంపసరములు, నాగవంక, రాగిణి, చంద్రవంక, తమలపాకు, భుజబంధులు, గజ్జెలవడ్డానం, చిలుక, దీనిలో బిళ్ళల మొలత్రాడు ముఖ్యమయినది. సత్యభామ పాత్రకు 27 నక్షత్రముల జడ, చతుర్దశ భువనము లనే 14 కుచ్చుల జడగంటలు, త్రిభువనాలు అనే జడబంతులు ఉంటే, అలమేలు మంగమ్మ పాత్రకు దశావతార జడ ధరింపజేసేవారు. ఇవన్నియూ లక్కతో చేయబడి అద్దములు అంటించబడిన ప్రత్యేకమయిన ఆభరణములు.

గతంలో ముప్పయి సంవత్సరాలు క్రితంవరకూ గురుదేవులయిన శ్రీ సిద్దేంద్రయోగి ఆజ్ఞను శిరసావహించి పురుషులకు తప్ప స్త్రీలకు విద్య నేర్పని కూచిపూడి భాగవతులు కాలమాన పరిస్థితుల మూలంగా ప్రభావితం అయ్యి ఈనాడు స్త్రీలకు కూడా విద్య నేర్పు తున్నారు. బహుపాత్ర కేళికలయిన యక్షగానములు మానివేసి, ఏకపాత్రకేళికలుగా నాట్య

ప్రదర్శనలు చేస్తున్నారు. పూర్వకాలం నుండి ఆలయాలలో, ఆస్థానాలలో స్త్రీలు నర్తించి మెప్పించిన నృత్య విధానాలను తమ భాగవత నృత్యానికి చేర్చి ఆహార్యం నుండి, అభినయం వరకూ అన్నిరకాలుగా మార్పులు, చేర్పులు చేసి నూతనత్వంతో రూపుదిద్దుకొన్న ఈనాటి కూచిపూడి నాట్యప్రదర్శనలు ప్రేక్షకులకు ఆనందాన్ని కల్గిస్తున్నాయి. ఆంధ్రుల నృత్యకళా వైభవాన్ని దశదిశలు వ్యాపింపజేస్తున్నాయి. ఎందరో కళాకారులకు జీవన విధానాన్నిచ్చాయి. మరెందరికో విద్యను అందిస్తున్నాయి అనేది జగమెరిగిన సత్యం.

# ఆంధ్రనాట్యం

కళ పరమాత్మ నుండి జనించిన అరని జ్యోతిలా జ్వాజ్వల్యమానంగా ప్రకాశిస్తుంది. ప్రకృతి యొక్క కాలపరిణామాలకు ఒక్కోసారి వెనుకపడినా, అనతి కాలంలోనే విజృంభించి విశ్వం అంతటా తానుగా నిండియుంటుంది. అతి ప్రాచీనమైనవి మన భారతీయ కళలు, ఈ కళలకు ఆది అంతములు లేవు. అనంతమైనదీ కళ, అజరామరమైన భారతీయ సాంప్రదాయ కళలలో ఆంధ్రులకు ఆదినుండి ప్రత్యేక స్థానం ఉంది.

మానవునికి సుఖసంతోషాలనిచ్చే పరమౌషదం కళ అని చెప్పవచ్చును. మన సాంప్రదాయ కళలన్నింటిలో అగ్రతాంబూలం అందుకొంది నాట్యకళ, కారణం నాట్యంలో అనేక కళలు లీనమైఉన్నాయి. చిత్రకళ, శిల్పకళ, సంగీతం, సాహిత్యం, రూపకళ, అంతేగాక శ్రవణ, నేత్రపర్వమై - హృదయానికి శాంతి, మనసుకు ప్రశాంతతను కల్గించి హాయినిచ్చే సాంప్రదాయకళ నాట్యం. ప్రకృతిలోని ప్రతికదలికలో నాట్యం అంతర్గతంగా లీనమై ఉంది. చక్కని సంధ్యా సమయంలో అలలు అలలుగా కదిలివచ్చే నదీజలాలలో నాట్యం ఉంది. చెట్లసందుల గుండా ప్రసరించే కిరణాలు నాట్యం చేస్తాయి. చల్లగాలికి ఊగే పచ్చని చెట్లలో నాట్యం ఉంది. సముద్ర తరంగాలలో తాండవ నృత్యాన్ని, సెలయేటి ప్రవాహంలో లాస్యాన్ని మనం చూడగలం. రాగ తాళాలయాశ్రయమైన ఈ నాట్యరంగంలో ఆదినుండి మూల పురుషులు అందరూ ఆంధ్రులు కావడం మనం గర్వించదగ్గ విషయము. అభినయకళలో ఆనాటి నుండి (ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడిన ఆంధ్రజాతి నుండి) ఈనాటి వరకూ ఆంధ్రులను మించి అభినయించగలవారు అరుదు.

నాట్యకళారంగానికి మూల పురుషుడు భరతుడు. ఈయన "నాట్యశాస్త్రం" రచించిన మునిపుంగవుడు. ఈయన ఏ శతాబ్దం వాడో ఇంకా ఖచ్చితమయిన కాలనిర్ణయం జరుగలేదు గానీ, ఈయన ఆంధ్రుడు. నాట్యరంగానికి ప్రామాణిక గ్రంథంగా ఎంచబడి యావత్ భారతంలో ప్రచారంలో నున్న "అభినయదర్పణం" రచించిన నందికేశ్వరుడు ఆంధ్రుడు. దేశి, తాండవ నృత్యరీతులు విడివిడిగా వివరించి, తాండవరీతులు పొందుపరచిన "నృత్తరత్నావళి" రచించిన కాకతీయ గజసైన్యాధిపతి జాయప ఆంధ్రుడు. వీరునిగా శత్రువులను ఎదిరించి కత్తితో నాట్యం చేయిస్తూ - నాట్యరంగంలో నిష్ణాతుడై కవనాన్ని కదిలించి ఒక నాట్యశాస్త్ర గ్రంథం రచించిన జాయపను గన్నకీర్తి ఆంధ్రులకే దక్కింది. ఆయనకు సమకాలికుడయి దేవగిరి దుర్గాన్ని ఏలిన సింగభూపాలుడు ఆస్థానంలోని సారంగదేవుడు " సంగీతరత్నాకరం"లో దేశి, ప్రాంతీయ నృత్యాలగూర్చి వివరించాడు. రాచకొండ నేలిన సింగభూపాలుడు, కొండవీడు నేలిన కొమరగిరిరెడ్డి 'వసంతరాజీవం' అనే సంపూర్ణ

నాట్యశాస్త్ర గ్రంధాన్ని రచించాడు. ఇలా ఎందరో నాట్యకళాశాస్త్ర వేత్తలు - అందరూ ఆంధ్రులే గావడం ఈనాటికీ వారు రచించిన గ్రంధాలే నాట్యకళారంగానికి ప్రామాణికలు గావడం, ఆంధ్రులుగా మనం గర్వించదగిన విషయం. అసలు నాట్యశాస్త్రం ఆంధ్రులదేమో అనే భావం గలుగక మానదు.

ప్రాచీన కాలంనుండి ఆలయాలలో, రాజుల ఆస్థానాలలో నృత్యం ప్రదర్శింపబడేది. ఆలయ ఆగమనర్తనం ఆంధ్రశిల్పులు తెలుగునాట ఆలయాలు నిర్మించక పూర్వం నుండి అభివృద్ధి చెందినట్లుగా మనం ఊహించవచ్చును. నాట్యకళావిశిష్టతను ఆగమ శాస్త్రంలో పేర్కొన్నారు. ఉదయం ప్రభాతసేవ మొదలుకొని రాత్రి పవళింపు సేవ వరకూ అనేక కార్యక్రమాలలో చేసే పూజలలో నృత్యపూజ కూడా ఒక భాగంగా మన ఆంధ్రావనిలో దైవసేవ జరిగేది. ముఖ్యంగా మన ఆంధ్రావనిలో ముఖలింగేశ్వరం, శ్రీకూర్మం, అరసవల్లి, ద్రాక్షారామం, ఆచంట వెంకటగిరి, శ్రీ కాళహస్తి, తిరుపతి, పిఠాపురం, అమరావతి. పెద్దాపురం, తుని, క్షీరారామం, అహోబిలం, జొన్నవాడ, నాగులాపురం, సింగరాయకొండ, అలంపురం, ధర్మపురి, వేములవాడ, విజయనగరం వంటి ఎన్నో ఆలయాలలో నృత్య పూజకై నర్తకీమణులు ఉండేవారు. వారిని దేవదాసీలుగా వ్యవహరించేవారు, వారు అస్ఖలిత బ్రహ్మచారిణులై దేవాలయంలోనే ఉంటూ తమ జీవితాలను దైవసేవకు అంకితం చేసి, చివరకు ఆ దైవంలోనే లీనమైపోయేవారు.

రాజరికపు వ్యవస్థ మొదలయిన నాటినుండి రాజు యొక్క ఆనందంకోసం ఆస్థాన నర్తకీమణులు నియమింపబడ్డారు. వారు నిండు సభలో పండితుల, విదేశి పండితుల రాయ బారుల, పామరుల సమక్షంలో నాట్యం చేసి వారందరి మెప్పును పొందేవారు. తమ అభినయ కౌశలంతో సభాసదులను రంజింపజేసేవారు.

విజయనగర సామ్రాజ్యాధిపతి, దేశభాషలందు తెలుగులెస్స అని కీర్తించిన శ్రీకృష్ణ దేవరాయలవారి ఆస్థానంలో అష్టదిగ్గజాల వంటి పండితోత్తములను మెప్పించి, విద్వత్సభా రంజక బిరుదు పొందిన శ్రీరంగరాజు కుమార్తె రంజకంకుప్పాయి. ఆమె సకలశాస్త్ర పండితురాలు గనుకనే ఆనాడు ఆమెకు ఎదురులేదు. చాళుక్యులకాలంలో చెల్లవ్వ, చెలుకాంబలు, రెడ్డిరాజుల కాలంలో కర్పూర వసంతరాయ బిరుదు పొందిన కొమరగిరి రెడ్డికి స్ఫూర్తిగ నిలిచి వసంతరాజీవం రచింపజేసిన లకుమాదేవి, కాకతీయ రాజులకాలంలో మాచల్దేవి. ఆమె తన వంశ చరిత్రనే యక్షగానంగా నర్తింపజేసి చూసి తరించిందా ఉద్దండురాలు. తంజావురి నాయకరాజుల ఆస్థానంలో ముద్దు చంద్రలేఖ. అచ్యుతరాయల ఆస్థాననర్తకి తిరువెంకట మాణిక్యం, ఆమె అచ్యుతరాయలను మెప్పించి పల్లకిని బహుమతిగా పొందిన ఘనురాలు.

గోల్కొండ పాదుషాను నాట్యకళతో మెప్పించి తనపేర ఒక మహానగరాన్నే నిర్మింపజేసు కొన్న భాగామతి, ఆమె అక్క భారామతి, భాగీరథి, కొండవీటి రాజులనాటి మీనాక్షి, కామాక్షి ఇలా ఎందరో కళాకారిణులు ఆంధ్రులుగా పుట్టి ఆంధ్రుల నాట్యకళకు సాటి మరెవ్వరూ లేరని నిరూపించిన నాట్యకళాకారిణులు ఎందరో ఉన్నారు. వారు ఆనాడు నర్తించినది ఏకపాత్ర కేళికా ప్రదర్శనం, కానీ - ప్రస్తుత కాలంలో రాజాస్థానాలు, దేవాలయాలలో నృత్యపూజలు లేని కారణంగా మన ఆంధ్రుల ఏకపాత్ర కేళికా సాంప్రదాయ నృత్యకళకు వారసులుగా చివరివారయిన అన్నాబత్తుల బులివెంకటరత్నం, ఎండమూరి రామరత్నం, దుగ్గిరాల బాపడు, అన్నాబత్తుల సూర్యకాంతం. వెంకట విజయ గోపాలరత్నం నాగమణెమ్మ, దుగ్గిరాల జగదాంబ, బండి గంగాధరం, సరిదే మాణిక్యం, జంపాముత్యం వంటి వృద్ధులయిన స్త్రీ కళామూర్తులు మిగిలి ఉన్నారు.

పోషణలేక ప్రజాదరణలేక మరుగున పడిపోతున్న మన ఆంధ్రుల ఏకపాత్రా కేళికా సాంప్రదాయం నృత్యంలో, అవకాశం గ్రహించి కొన్ని పురుష సాంప్రదాయ నృత్యాలు కొద్దిమార్పులతో గుర్తింపు పొందాయి. అందుకు కారణం విద్వాంసురాండ్రయిన ఈ వృద్ధకళాకారిణులకు వారసులు లేకపోవడం, ఉండినా వారు బహిరంగ ప్రదేశాలలో నృత్యకళను ప్రదర్శించగపోవడం కారణం. పూర్వం నుండి ఈ ఏకపాత్ర కేళికలు ఆలయాల లోనూ, రాజుల ఆస్థానాలలోనే నర్తించడం అలవాటు. ఇటువంటి కారణాలు ఎన్నో ఉన్నాయి. అందువల్ల మన స్త్రీపాత్ర కేళికలు, స్త్రీ సహజ సౌకుమార్యానికి తగినట్లుగా మలచబడిన స్త్రీ సాంప్రదాయ నృత్యకళ దాదాపుగా అంతరించినట్లుగా మరుగున పడిపోయింది. కానీ - ఆదిశంకరుల అమరుకం, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు వంటి అభినయ ప్రాధాన్యం గల నర్తనాలు నర్తించడంలో ఈ స్త్రీ కళాకారిణులు అగ్రగణ్యులు. వారిని మించి నర్తించగల వారు లేరు. ఆనాడు ఈనాట్యం మూడు విధాలుగా ప్రదర్శింపబడింది.

1. ఆగమశాస్త్రం పద్ధతిని అనుసరించి దైవసాన్నిధ్యంలో నృత్యపూజలో నర్తకీమణులు నర్తించే ఆగమనృత్యాలు.
2. ఆలయం ప్రాంగణంలో పండితుల, శాస్త్రవేత్తల కొరకై నృత్యకేళికలు.
3. సామాన్య ప్రజానీకానికి ఆలయం వెలుపల భారత భాగవత, శివపురాణాలలోని ఘట్టాలను యక్షగానాలుగా నర్తించడం.

ఈ ఆంధ్రుల నృత్యాలు మూడు పద్ధతులుగా ఉండేవి.

1. మార్గసాంప్రదాయ పద్ధతి
2. దేశిసాంప్రదాయ పద్ధతి
3. శాస్త్రీయ విన్యాసాల నర్తన పద్ధతిగా ప్రదర్శిత మయ్యేది. ఈ మూడు కూడా నాట్యదర్శి, లోకదర్శి సాంప్రదాయాల ననుసరించి రూపొందించబడినవే.

2 వేల సంవత్సరాలుగా యావత్ భారతావనిలోని పండితపామరులను రంజింప జేసిన మన ఆంధ్ర స్త్రీ కళామూర్తులు ప్రదర్శించిన నాట్యకళ, రాజాస్థానాలు, ఆలయాలలో నృత్య పూజలు కరువైన కారణంగా పోషణలేక మరుగునపడి, పురుష సాంప్రదాయ నృత్యాలుగా పేర్గాంచి నటువంటి నృత్యాలు బహుళ ప్రచారం లోనికి వచ్చాయి అటువంటి సమయంలో మన ఆంధ్రుల అభినయకళ మరుగున పడిపోగూడదని, ఆంధ్రదేశాన ఏకపాత్ర కేళికలు అంతరించి పోరాదనే సత్సంకల్పంతో 1974 సం॥లో ప్రాచీన కాలంనుండి నాట్యకళను ఆరాధించి, సేవజేసి వృద్ధాప్యం మూలంగా మరణించినవారు గాక మిగిలివున్న అరవైమంది వరకూ ఆలయ, ఆస్థాన నర్తకీమణులయిన వృద్ధస్త్రీ కళామూర్తుల నందరినీ రాజమండ్రిలో సమావేశపరచి "భరతకళాప్రపూర్ణ" డా॥ నటరాజ రామకృష్ణగారి ఆధ్వర్యంలో అందరిచేత అభినయింపజేసి, వారిని సత్కరించి, వారి ఆజ్ఞప్రకారం ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కో పేరుతో ప్రచారం పొందిన మన ఆంధ్ర దేశంలోని వివిధ స్త్రీ సాంప్రదాయనృత్యాలు అయిన కచ్చేరి ఆట, దర్బారు ఆట, కర్నాటకం, నట్టువమేళం, దాసీభరతం ఇలా ఎన్నో పేర్లతో ప్రచారం పొందిన నాట్యానికి ఒకే పేరు నిర్ణయించాలని తలంచి వంశపారం పర్యంగా ఆలయాల్లో, ఆస్థానాలలో నర్తించి నృత్యకళకోసమే తమ జీవితాలు త్యాగం జేసిన వృద్ధ కళామూర్తుల ఆదేశం ప్రకారం. మనం ఆంధ్రులం. మనది ఆంధ్రుల నృత్యకళ గనుక "ఆంధ్రనాట్యం"గా నామకరణం చేయడం జరిగింది.

ఆనాటి నుండి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి సహకారంతో "ఆంధ్రనాట్యం" అనే సిలబస్ వ్రాయించారు. ఆ సిలబస్ ప్రకారమే ఆనాటినుంచి హైదరాబాద్ ముఖ్యకేంద్రంగా ఆంధ్రనాట్య సాంప్రదాయంలో అనేకమంది యువతీయువకులకు శిక్షణనిస్తున్నారు. రాష్ట్రం లోని వివిధప్రాంతాలలో ఈ ఆంధ్రనాట్యం శిక్షణాకళాశాలలు స్థాపించి, రెండువేల సంవత్స రాలుగా ఆంధ్రుల ఆడపడుచులు తమ పసుపుకాళ్ళపారాణి నుండి చిందించిన మువ్వల సవ్వడిని పునరుద్ధరించుతున్నారు. అలా స్థాపించిన తొలి ఆంధ్రనాట్యం, ఆలయసాంప్రదాయ నృత్యాల శిక్షణాకళాశాల రాజమండ్రిలోనే శ్రీ సప్పా దుర్గాప్రసాద్ ఆధ్వర్యంలో దిగ్వి జయంగా నిర్వహింపబడుతుంది. అంతేకాక కాకినాడ, విజయవాడ, వేములవాడ, నిజామాబాద్ వరంగల్, సిద్దిపేట, ఇలా సుమారు 50 వరకూ ఆంధ్రదేశం నలుమూలలా శిక్షణాకళాశాలలు ప్రారంభించబడినాయి. అంతరించిపోతున్న మన ఆంధ్రుల ఏకపాత్రకేళికా సాంప్రదాయ నృత్యకళ, నాట్యకళాపితామహులు శ్రీ నటరాజరామకృష్ణ సారధ్యంలో గత పది సంవత్స రాలుగా సంపూర్ణవికాశాన్ని తిరిగి సంతరించుకొంటుంది.

ఇటీవలే విజయవాడ పట్టణంలో "ఆంధ్రనాట్య పీఠం" కూడా స్థాపించబడింది. రెండువేల సంవత్సరాలుగా నర్తింపబడి ఎంతో గౌరవాన్ని ఆంధ్రదేశానికి సంపాదించి పెట్టిన

శ్రీ సాంప్రదాయ నృత్యాలకు వారసులుగా శ్రీ నటరాజ రామకృష్ణ అయితే, ఆయనకు వారసులుగా నాట్యప్రచారం చేస్తున్న సర్వశ్రీ రమేష్, కళాకృష్ణ, సప్పాదుర్గాప్రసాద్ వంటి యువ కళాకారులు తమ శిష్యుల ప్రదర్శనల ద్వారా అంతరించిపోతున్న ఆంధ్రుల నాట్య కళను ప్రచారం చేస్తున్నారు.

చాలామందిలో "ఆంధ్రనాట్యం" ఒక నూతన ప్రక్రియ అనే అపోహ ఉంది. కానీ అది అపోహ మాత్రమే. ఆంధ్రకళాకారిణులు భారతావనిలోని అనేక ఆలయాలలో, ఆస్థానా లలో నర్తించి, పండిత పామరుల ప్రశంశలు పొందిన నాట్యం మన ఆంధ్రుల నాట్యం "ఆంధ్రనాట్యం" మాత్రమే.

యావత్ ప్రపంచానికీ తమదంటూ ఒక నాట్యసాంప్రదాయం ఉందని ప్రచారంచేసి, ప్రపంచప్రజల మన్ననలుపొంది, వారిని కూడా ఆంధ్రనాట్యం నర్తకులుగా తయారుచేసి దేశ విదేశాలలో గొప్పగా తెలుగువారి కీర్తి పతకాన్ని ఎగురవేస్తున్న ఏకైక శ్రీ సాంప్రదాయ నృత్యం "ఆంధ్రనాట్యం". అభినయంలో తమకు సాటి మరెవరూ లేరని గర్వంగా మన ఆంధ్రజాతి చెప్పుకునేలా అభినయింపబడిన ఏకైక నర్తన సాంప్రదాయం "ఆంధ్రనాట్యం"

ఆంధ్రులు అభినయంలో అగ్రగణ్యులు.

ఆంధ్రుల సాత్వికాభినయానికి తిరుగులేదు.

ఇక ఆంధ్రనాట్యం ప్రదర్శనా పద్ధతి మూడు రకాలుగా ఉంటుంది.

1. ఆలయ సాంప్రదాయ ప్రకారం ఆగమనృత్యాల ప్రదర్శనం.
2. ఆస్థాన సాంప్రదాయ ప్రకారం అభినయ నృత్యాల ప్రదర్శనం.
3. దేశి భాగవత సాంప్రదాయం ప్రకారం కలాపం ప్రదర్శనం.

ఇవిగాక "పేరిణి శివతాండవం" ప్రదర్శనం పురుషులకోసం.

పుష్పాంజలితో ప్రారంభం అయిన నృత్య ప్రదర్శనం ఆగమశాస్త్ర పద్ధతిలో కుంభ హారతితో హారతి పట్టడం, పుష్పాలు సమర్పించి అడ్డిత చారీ నృత్యంతో ప్రారంభింపబడి, కైవారనృత్యాలుగా గల ఆగమనృత్యాలు తొలిభాగం.

శాస్త్రీయ సంగీతంలోని పదవర్ణాలు, క్షేత్రయ్యపదాలు, అష్టపదులు, తరంగాలు, స్వరజతులు, స్వరపల్లవులు, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు వంటి అభినయ ప్రదానంగల సంగీత రచనలపై నాట్యం రెండవ భాగం.

శ్రీ భాగవత కళలలోని కలాపములు నిత్యనూతన ప్రక్రియగా పేరొందిన తొమ్మిది రాత్రులు నర్తించే "నవజనార్దన పారిజాతం" అనే భామాకలాప నృత్యప్రదర్శనం మూడవభాగం. పూర్వం ఈ మూడు సాంప్రదాయాలు విడివిడిగా అభివృద్ధి చెంది ప్రదర్శింప బడినా, ప్రస్తుతం "ఆంధ్రనాట్యం" ప్రదర్శనలలో ఈ మూడు సాంప్రదాయ ప్రదర్శనాం శాలుగా ప్రదర్శనం కొనసాగుతుంది.

# పేరిణి శివతాండవం

సుమారు మూడువందల సంవత్సరాలు ఓరుగల్లును రాజధానిగా చేసుకొని యావదాంధ్ర దేశాన్ని ఏకచత్రాధిపత్యంలోనికి తీసుకవచ్చి సుభిక్షంగా కాకతీయ మహారాజులు పరిపాలించారు. గణపతి దేవుని కాలంలో సుస్థిరతనూ, రుద్రమదేవి కాలంలో ఉచ్ఛస్థితినీ, ప్రతాపరుద్రుని కాలంలో మహోన్నతంగా వెలుగొందింది. కాకతీయ సామ్రాజ్యలక్ష్మి, కదనరంగంలోనే గాక కళారంగంలో కూడా కాకతీయులు కాకలుతీరిన వీరులు. వీరు వీరశైవులు అందువల్లనే వీరిహయాంలో వీరశైవం మహోన్నతంగా వెలిగింది. వీరు నిర్మించిన శైవాలయాలు అనేకం. వాటిలో స్వయంభూ ఆలయం, పద్మాక్షి ఆలయం, వేయిస్థంభాలగుడి, సూర్యాలయం రామప్ప దేవాలయం, ముఖ్యమయినవి. రామప్పగుడి ఓరుగల్లుకు 64 కి॥ మీ॥ దూరంలో ఉంది. రేచర్లరుద్రుడు అనే కాకతీయ సామంతుడీ ఆలయం నిర్మించాడు. కదనరంగంలోనే కాక నాట్యరంగంలో కూడా ప్రజ్ఞాపాటవాలు గలిగిన జాయపసేనాని రచించిన నృత్తరత్నావళిలోని నాట్యశాస్త్ర సారాన్నిబట్టి ఈ రామప్ప దేవాలయంలోని శిల్పాలు మలచబడ్డాయి.

కాకతీయుల కాలంలో తెలుగు వీరులచే ప్రదర్శింపబడిన పేరిణి శివతాండవం కీర్తి హిమాలయ శిఖరాలకు చేరుకుంది. భారతావనిలోని అనేక ప్రాంతాలలో తెలుగువీరులు పేరిణి శివతాండవం ప్రదర్శించినట్లు మనకు అనేక ఆధారాలున్నాయి. పేరిణి శివతాండవం వీరులు, మహేశులు, మైలారుదేవులు, పశుపతులనే నాలుగు తెగలవారు నర్తించేవారు. ప్రతి శివాలయంలో రోజుకు మూడు పర్యాయములు ఈ తాండవం ప్రదర్శింపబడేది అనాడు.

శివుని తాండవాలు ఏడురకాలు, అవికాక దేశితాండవరీతులు ఏడురకాలు. అవి శుద్ధ, దేశి, పేరిణి, కుండలి, దండిక, కలాసతాండవాలు. వీటిలో ముఖ్యమయినది పేరిణి శివతాండవం. కాకతీయుల హయాంలో ఈ పేరిణి శివతాండవాన్ని మూడు రకాలుగా ప్రదర్శించేవారు.

1. ఆలయంలో శివప్రీతికొరకు శివప్రేరణ.

2. యుద్ధభూమికి సైన్యాలు తరలివెళ్ళే సమయంలో యుద్ధప్రేరణ.

3. సామాన్య ప్రజల ఆనందం కొరకు ప్రేరణతాండవం.

ఈ పేరిణి శివతాండవ భంగిమలు, విన్యాసగతులు పురుషునిలోని వీరత్వాన్ని ప్రకాశింపజేసేవిగా ఉంటాయి. కాకతీయ సామ్రాజ్య పతనంతో తెలుగువీరుల ఉద్ధృతనర్తన విన్యాసం పేరిణి శివతాండవం కూడా మరుగున పడిపోయింది.

సుమారు 700 సం॥ల అనంతరం "కళాసరస్వతి" శ్రీ నటరాజ రామకృష్ణగారు తెలుగువీరుల ఉద్ధృతనర్తనాన్ని పునఃసృష్టి చేయాలనే సంకల్పంతో రామప్ప దేవాలయంలోని ప్రతిశిల్పం, ప్రతిభంగిమలలోని అంతరార్థాన్ని పరిశోధించి, పది సంవత్సరముల నిర్విరామ కృషిసల్పి, రామప్ప దేవాలయంలోని శిల్పాలు, జాయపసేనాన్ని నృత్తరత్నావళిలోని సారాన్ని ఆధారంగా జేసుకొని పేరిణి శివతాండవాన్ని పునఃసృష్టి చేశారు.

సాధారణంగా శివతాండవం చేసే పద్ధతివేరు. ఈ పేరిణి శివతాండవం నర్తించే పద్ధతి వేరు. పేరిణి వీరుడు శివుని సన్నిధిని నిలచి ఓ శివా ! నీశక్తి నాపై ఆవహింపజేసి, నా శరీరాన్ని పవిత్రపరచి, నాచే నీ శివతాండవాన్ని నర్తింపజేయ్యి, అని ప్రార్థించి శివునిరుద్రు నిగా ప్రేరణజేసి ఆ శివశక్తిని తనపై ఆవహింపజేసుకొని ఈ తాండవాన్ని ప్రదర్శిస్తాడు. అందుకే ఈ తాండవానికి "ప్రేరిణి" "పేరిణి శివతాండవం" అనే పేరువచ్చింది.

చాలామందిలో ఒక సందేహం ఉంది. నాయకరాజుల ఆస్థానంలో ముద్దు చంద్రలేఖ నర్తించిన పేరిణి, ఈ పేరిణి ఒక్కటేనా ? అని కానీ - ఆమె నర్తించినది కోమలమైన నర్తనం. ఈ నర్తనంలో కూడా 5 ప్రదాన అంశాలుండేవి. అది నృత్తంతో ప్రారంభం అయ్యి అభినయంతో ముగిసేది. స్త్రీలు నర్తించే పేరిణిలో సాత్వికాభినయం ప్రధానపాత్ర వహిస్తుంది. స్త్రీల పేరిణి కుండలమీద కూడా నర్తిస్తారు. కానీ స్త్రీలు నర్తించే పేరిణి వేరు. కాకతీయుల నాటి పేరిణి శివతాండవం వేరు.

పేరిణి శివతాండవంలో గర్షరం, విషయం, భావాశ్రయం, కవివారం, గీతం ఇలా అయిదు ప్రధాన మయిన అంశాలున్నాయి. శివప్రేరణతో ప్రారంభం అయిన పేరిణి నర్తన సాంప్రదాయ ప్రదర్శనం తహననర్తన విన్యాసాలు డమరుకు, మృదంగ, పిపీలక, సమయతి విన్యాసాలు, శృంగనర్తనం, భ్రమరనర్తనం, కైవారనర్తనాలు ఉంటాయి. అంతేగాక పంచభూతాలయిన పృధ్వి, అఫత్, తేజో, వాయు, ఆకాశ దేవతలపై నర్తనాలు భారతావనిలో స్వయం సిద్ధమూర్తులుగా వెలసిన పంచలింగమూర్తులు,

పృధ్విలింగం శ్రీ కాంచీపుర ఏకాంబరేశ్వరస్వామి అఫత్‌లింగం.

వాయులింగం శ్రీ కాళహస్తీశ్వరస్వామి తేజోలింగం.

ఆకాశలింగం శ్రీ చిదంబర నటరాజస్వామి.

ఈ పంచాంగ మూర్తులకు అంకితమిస్తూ పంచముఖ శబ్దనర్తనాలు ప్రదర్శింపబడతాయి. సమీకరణయతి విన్యాసంతో "పేరిణి శివతాండవం" ప్రదర్శనం ముగుస్తుంది.

పేరిణి శివతాండవం ఒక యోగం. పేరిణి నర్తకుడు ఒక యోగి పురుషుని పురుషుడుగా నాట్యం చేయాలి. వీరుడు వీరునిగా నాట్యము చేయాలి అనే ఆశయంతో తెలుగు కళాకారులు తరతరాలుగా తపస్సు చేసి ఆ తపః ఫలితంగా ఒక విశిష్టమయిన ఉధృతనర్తనాన్ని మనకు అందించారు. అదే "పేరిణి శివతాండవం" ఇది ప్రపంచ నర్తన విన్యాసాలలో 10వ ఉధృత నర్తనంగా గుర్తింపు పొందింది.

తెలుగు ప్రజలు గర్వించదగ్గ నర్తనం పేరిణి శివతాండవం. తెలుగు వీరుల ఏకైక ఉధృత నర్తనం పేరిణి శివతాండవం. తెలుగువీరుల కీర్తి, తాండవవిన్యాసరీతులు ప్రపంచం అంతటా చాటిన నర్తనం "పేరిణి శివతాండవం".

# గొల్ల కలాపం

పాలు, పెరుగు, మజ్జిగ (చల్ల) అమ్ముకొంటూ జీవించే ఒక పండితురాలయిన సామాన్య గొల్లకన్యకూ. పండితుడయిన ఒక బ్రాహ్మణునికి మధ్య జరిగే సంవాదమే ఈ గొల్లకలాపం. మహాయోగి పుంగవుడయిన సిద్దేంద్రయోగి రచించిన భామాకలాపం శృంగార ప్రభంధకావ్యంలో ఈ గొల్లభామ పాత్రకూడా మిళితమై ఉండేది. కానీ కాలక్రమేణా కొందరు పండితులు ఆ ప్రభంధంనుండి ఈ గొల్లభామ పాత్రను వేరుచేసి ఆధ్యాత్మిక విషయాలను జోడించి, ధర్మసూక్ష్మలను వెల్లడించే అద్భుతమయిన ప్రక్రియగా ఈ గొల్లకలాపాన్ని మలచి ప్రదర్శనములు చేశారు. తొలుదొలుత సిద్దేంద్రయోగి రచించిన నృత్యనాటక ప్రదర్శనములో గోపిక లేక గొల్లభామపాత్ర పాలు, పెరుగు అమ్ముతూ తొలిగా రంగ ప్రవేశంగావించేది. ఆమెకంటే ముందుగా రంగస్థలం అలంకరించిన విధూషకుడూ గోపిక పాత్రధారి తన నృత్యగానాలతో ప్రేక్షకులను మెప్పించిన అనంతరం ఆమె యొక్క పాత్రను పరిచయం చేస్తూ, ఆమెతో సంభాషణ ప్రారంభించేవాడు. ఆ సంభాషణ హాస్యధోరణిలో, ఆధ్యాత్మిక ధోరణిలో, శృంగార రస ధోరణిలో ఉండేది. వారు అలా సంభాషించుకొంటున్న సమయంలోనే శ్రీ కృష్ణపాత్రధారి ప్రవేశించి గొల్లభామతో సరసము లాడుట మొదలు పెడతాడు. కానీ గోపిక శ్రీకృష్ణుని పరమాత్మునిగా కీర్తించి నమస్కరిస్తుంది. దాసురాలితో మహారాజువైన నీవు సరసము లాడుట తగదని వారిస్తుంది. విధూషకుడనే పండితుడు వారిరువురిమధ్య రాయభారంపేరుతో హాసాన్ని పండించి ప్రజలను వినోదపరచి వారిరువురినీ కలుపుతాడు. ఇలా గొల్లభామ, శ్రీకృష్ణుల మధ్య ఆత్మయొక్క, పరమాత్మ యొక్క చర్చలు, విదూషకుని హాస్య, చమత్కార వ్యాఖ్యలు, వ్యాఖ్యానాలు అనంతరం సత్యభామ పాత్ర ప్రవేశించడం జరిగేది.

పండితులు కొందరు గొల్లభామ, విధూషకుల పాత్రలను వేరు చేసి ప్రత్యేకంగా "గొల్లకలాపం" అని నామకరణం చేసి హైందవ జాతియొక్క నాగరికతను, మతం యొక్క గొప్పతనం, సంస్కృతి యొక్క ఉన్నతిని, ఆచార వ్యవహారములలోని మంచిని, వర్ణవ్యవస్థ లోని విషయాన్ని గూర్చి అనేక విషయాలు విపరంగా చర్చరూపంలో గుప్పించి, ఆధ్యాత్మిక విషయాలు బోధించే వేదస్మృతి, పురాణేతిహాసముల నుండి కొన్ని ధర్మసూక్తులను తత్వాలుగా రచించి, ఆధ్యాత్మిక వేదాంత ప్రభంధకావ్యంగా ఈ గొల్లకలాపాన్ని సృష్టించి,

తీర్చిదిద్ది మనకు అందించారు. ఈ గొల్లకలాపంలో విధూషకుడనే బ్రాహ్మణపండితుడు గొల్లభామ వీరిరువురే పాత్రధారులు. గొల్లభామ ప్రవేశ దరువు :-

"గొల్లభామ వచ్చేనూ చల్లోయని" అంటూ పాడుతుండగా గొల్లభామ ప్రవేశించి తానూ పాడుతూ నాట్యం ఆడుతుంది. అనంతరం విధూషకుడు నీవెవరూ అని ఆమెను ప్రశ్నిస్తాడు. తానొక గొల్లభామనని ఆమె సమాధానం చెబుతుంది. "గొల్ల" అనే శబ్దానికి అర్థం ఏమిటని విధూషకుడు ప్రశ్నిస్తాడు. ఆమె సమాదానం చెబుతుంది. ఇలా ప్రారంభం అయిన నృత్యప్రదర్శనం ఎన్నో అతిశయోక్తులతో, చల్లయొక్క గొప్పతనం, గొల్లవారి గొప్పతనం, అసలు ఈ చరాచర సృష్టిలోని దేవతలు, మానవులు అందరూ గొల్లకులానికి చెందినవారేనని ఎన్నో ధర్మసూత్రాలు, పురాణ యితిహాసాలు, అందులోని సారాంశాలు ఉదాహరణలుగా చెబుతూ ఆధారాలు చూపించి నిరూపిస్తుంది గొల్లభామ.

ఉదా :- భగవద్గీతలోని శ్రీకృష్ణుడు కురుక్షేత్రం రణరంగంలో బందువులనూ, హితులను చంపలేనని, వారితో యుద్ధం చేయడానికి మనసు అంగీకరించడం లేదనిఅస్త్రసన్యాసం చేసిన అర్జునునికి విశ్వరూప సందర్శనాభాగ్యం కల్గించిన సమయంలో - "ఏ స్వామి దేవాన్ తవదేవదేహి"

అని పార్థుడు పలికిన శ్లోకం ఆధారంగా చేసుకొని శ్రీకృష్ణుడు తన శరీరమునందు సర్వ స్వరూపములు ఇమిడి ఉన్నవి కాబట్టి సర్వజీవులకూ అతడే తండ్రి. కాబట్టి అందరూ గొల్లవారేనని తర్కిస్తుంది గొల్లభామ ఇలా ఎన్నో రకాలుగా గొల్లకులం యొక్క విశిష్టతను వివరిస్తూ, ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు గూర్చి విధూషకునితో చర్చిస్తూ మనకు బోదిస్తుంది.

అంతేగాక, బ్రాహ్మణులు యజ్ఞయాగాదులు లోకకళ్యాణాలకై చేస్తారు. ఆ క్రతువులకు సంబందించిన వస్తువు ముఖ్యంగా గోవుల క్షీరం, అది గొల్లవారి ఉత్పత్తి అని, ఆ క్షీరం మూలంగానే యజ్ఞం జరుగుతుంది గనుక లోకకళ్యాణానికి గొల్లలు ఎలా ఉపయోగపడు తున్నదీ వివరిస్తుంది.

ఇంకా సర్వక్రతువులలో గొల్లలు ముఖ్యంగా పెంచే మేక ప్రధానమని వేదాలు ఘోషిస్తున్నాయి అని చెబుతుంది.

శ్రీమన్నారాయణుని సేవను మించిన పరధర్మం లేదని, నారాయణుని అవతారమైన శ్రీకృష్ణపరమాత్మను సేవించుటలో ధర్మము, అర్థము, కామము, మోక్షమూ చేకూరుతాయని చెబుతూ, పశుహింస దోషమని ప్రపంచంలో ప్రజలందరూ ఒకే వర్గానికి, ఒకే కులానికి, ఒకే జాతికి చెందిన వారని సర్వమానవ సమానత్వం ముఖ్యమని చెబుతూ, లోకంలో మంచి చెడు అనేవి రెండే కులాలని వివరిస్తుంది. ఇలా ధర్మసూక్ష్మాలు, ఆధ్యాత్మిక విషయాలతో సాగే గొల్లకలాపం ప్రదర్శనం మంగళ హారతితో ముగుస్తుంది.



# గురు శిష్యుల అనుబంధం

గురు బ్రహ్మ గురు విష్ణుః
గురు దేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరఃబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః

పూర్వకాలం నుండి గురువును ఇలా బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపునిగా ఎందుకు కీర్తించారో తెలుసా ? ఈ సకల చరాచర సృష్టిలో గురుశిష్యుల బంధం ఎంతో గొప్పది గనుక. శరీరానికి జన్మనివ్వడం, దాన్ని పెంచి పోషించడం, పెద్దవాడిని చేయడం తల్లితండ్రుల భాధ్యత, కర్తవ్యం. కానీ వ్యక్తికి విద్యనేర్పి మానసిక వికాశాన్ని, జ్ఞాన వికాశాన్ని కల్గించి, అతడిని గొప్పవానిగా తీర్చిదిద్దేవాడు గురువు. శరీరము ఉన్నంతవరకే తల్లితండ్రులు, భార్యాభర్తలు, బంధువులు అనే బంధాలుంటాయి. కానీ గురు ముఖముగా శిష్యుడు నేర్చుకొన్న విద్య ఇంకొకరికి నేర్పి గురువుగా మారి తన కీర్తిని శాశ్వతం చేసు కొంటున్నాడు శిష్యుడు. గురువుగా కొనియాడబడతాడు. ఎందరో శిష్యులకు తానే మార్గదర్శ కుడు అవుతాడు. అందుకే శరీరం నశించినా గురుశిష్యుల సంభందం ఈ లోకం ఉన్నంత వరకూ నశించదు. గురువుచే నాటబడిన జ్ఞానం అనే విత్తనం శిష్యునిలో మొలకెత్తి గురు దేవుని బోదలతో పెరిగి పెద్దదై, శాఖోపశాఖలుగా విస్తరించి ఎందరికో తన నీడన చోటు నిస్తుంది. విశ్వమంతా వ్యాప్తి చెందుతుంది. అంతేగాక విద్యనేర్పిన గురువుకే నీడ నీయ వచ్చును. ఇలాంటి సంఘటనలు అరుదుగా ఎక్కడో గానీ జరుగవు. అలా జరిగిన నాడు నిజమయిన గురువూ శిష్యుడు పొందే ఆనందం వర్ణనాతీతం. ఆనాటి వారిరువురి కలయిక అపురూపంగా ఉంటుంది, కానీ విత్తనం వేసిన ఫలితం గురువుకు మాత్రమే దక్కుతుంది.

శిష్యునిలోవి అజ్ఞానం అనే మాలిన్యాన్ని గురువు తన విద్యను నేర్పడం ద్వారా అంతమొందిస్తాడు.

"గురు" అనే శబ్దానికి అర్ధం గూర్చి ఇలా చెబుతారు.

"గు" అనగా చీకటి

"రు" అనగా పోగొట్టువాడు, అని అర్థం. శిష్యునిలోని అంధకారాన్ని పారద్రోలేం దుకు విద్య అనే జ్యోతిని వెలిగించి, అతడిలోని అంధకారాన్ని అదృశ్యం చేసి అతడి

జీవితంలో వెలుగులు నింపి తద్వారా అతడిని నమ్ముకున్న వారికీ, ముందుతరాలకూ మార్గం చూపే జ్యోతిగా అతడిని తయారు చేసి లోకానికి తన వంతు సేవ జేస్తున్నాడు గురువు.

అయితే అనాధిగా దైవంగా, తల్లితండ్రులకంటే మిన్నగా ఎంచబడుతున్న గురువు యొక్క స్థానం ఈనాడు సంఘంలో ఏమిటి ?

అని మనం ప్రశ్నించుకుంటే ఏమి సమాదానం లభిస్తుంది ?

హృదయాన్ని నలిపివేసినంత బాధ కొన్నిచోట్లా, హృదయంలో అగ్నిపర్వతం పేలినంత వేదన మరి కొన్నిచోట్ల మిగులుతోంది.

ఉదాహరణకు :- లోకంలో రోజూ మనం వింటున్న కొన్ని వాడుకపదాలు ఉదహరిస్తాను.

వంట్లో బాగాలేదు గురూ !

ఒక బీడీ ఉంటే ఇవ్వుగురూ !

ఈరోజు మందు కొడదాంగురూ !

చూశారా ! ఎంతో పవిత్రభావంగల "గురు" శబ్దానికి నేడు నిత్య కృత్యంలో పట్టిన దుర్గతి. (ఒక మంచి కావ్యంలో ఇలాంటివి వ్రాయకూడదు. కానీ లోకంలో జరిగే విషయాలు చూపి, ఒక గురువుగా నాలోని భాధను లోకానికి తెలియజెప్పాలని ఇలా వ్రాయడం జరిగింది ) ఆదినుండి ప్రత్యక్ష దైవంగా ఎంచబడిన గురుదేవుని కీర్తించే గురు శబ్దానికి ఎంతటి దుర్గతి పట్టిందో

ఇలా జరుగడానికి కారణం ఏమిటీ ?

నా ఉద్దేశ్యం ప్రకారం సంపూర్ణ గురుత్వం పొందని కొందరు స్వార్ధపరులు గురువులుగా ఈ సంఘంలో చలామణి అవుతూ గురువుహోదాలో తమ అవుసరాలను తీర్చుకొంటూ, అసహ్యంగా వ్యవహరిస్తున్నారు. ఇలా వ్యవహరించడంవలన సంఘంలో గురువుకుండే విశిష్టత తగ్గిపోతుంది. అంతేగాకుండా నిజమయిన శ్రోత్రీయ బ్రహ్మనిష్టాపరుడయిన గురువులకు కూడా ఈ చెడ్డపేరు ఆపాదించబడుతోంది. ఎవరు మంచి గురువో, ఎవరు దొంగ గురువో తెలియని పరిస్థితిలో మనం ఈనాడు ఉన్నాం అంటే ఇది అబద్ధంగాదేమో ?

ఇక నాట్యకళా ప్రపంచంలో ఇలాంటివికోకొల్లలు, ఇలా నాట్యకళా ప్రపంచంలో నేను చూసిన సంఘటనలు అనేకం ఉన్నాయి. అలాంటి సమయాలలో నేననుభవించిన భాధ వర్ణనాతీతం అయితే ఒక ఉదాహరణ మాత్రం వివరిస్తాను.

ఒక విద్యాన్వేషి అయిన యువకుడు నాదగ్గరకు అంటే, మా నృత్య శిక్షణా కళాశాలకు వచ్చాడు, నావద్ద విద్య నభ్యసిస్తున్న నా శిష్యులను చూశాడు. నేను నేర్పే విధానం, నా శిష్యులు నర్తించే విధానం చూశాడు. గురువుగారూ నృత్యం అంటే ఇలా ఉంటుందా ? ఇలా నేర్పుతారా ? ఇంత కష్టపడాలా ? అంటూ తన అనుభవాన్ని నాకు వివరించాడు.

నేను లోగడ ఒక రిద్దరు నాట్యాచార్యుల వద్ద విద్య నేర్చుకొనినాను, గానీ వారెవ్వరూ ఇలా విద్య నేర్పలేదు అన్నాడు. సాధారణంగా విద్యార్థులు ఒక గురువు వద్దనుండి మరో గురువు వద్దకు వెళ్ళినప్పుడు ఇలానే చెబుతుంటారు. ఇది మాకు మామూలే. కానీ అతడు చెప్పిన అనుభవం విన్నాక నాకే జాలికల్గింది. మొట్టమొదటి గురువుగారు ప్రారంభంలోనే నూటపదహారు రూపాయలతోపాటు కొత్త పట్టుబట్టలు దక్షిణకోరారు. విద్యమీది మక్కువతో అలానే చేశాను. ఆ తరువాత వారం రోజులకు కనుపించారు. నాలుగు రోజులు మాత్రం నాతో ఏవో గంతులు వేయించారు. గజ్జెలపూజ చేయించాలని గజ్జెలు కొనేందుకు డబ్బుతీసుక వెళ్ళిపోయారు. మరలా కనిపించలేదు. ఆయనగారి చిరునామా నాకు తెలియలేదు.

విద్యమీద మక్కువ చంపుకోలేక మరో గురువుగార్ని ఆశ్రయించాను. ఆయన అతి వయ్యారంగా తిప్పుకుంటూ మాట్లాడేవారు. సాధారణంగా మాట్లాడుకొనే సమయంలో కూడా చిత్ర విచిత్రంగా అభినయం చేసేవారు. ఆయనవద్ద విద్యనభ్యసించడం ప్రారంభించాను. ఆయన మద్యపాన ప్రియుడు. ఒకరోజు ఇరువురం కలిసి వెళుతుండగా దారిలో మద్యపాన శాల కనుపించింది. ఆయన నా ఎదురుగానే మద్యం సేవించారు. అంతేగాకుండా నన్నూ త్రాగమని బలవంతంచేశారు. కానీ నాకు అలవాటు లేనికారణంగా తిరస్కరించాను. ఇరువురం కలసి బయటకు వచ్చాము. ఆయనకు మద్యంమత్తు తలకెక్కి పిచ్చిపిచ్చిగా మాట్లాడుతూ, తూలుతూ, నడుస్తున్నారు. దారినిపోయే జనం మా యిద్దరినీ వింతగా చూస్తున్నారు. అసలే వయ్యారపు గురువుగారు, మద్యంమత్తులో మరింతవయ్యారంగా నడుస్తున్నారు భుజాలవరకూ జుట్టు ఎగురుతుంది. పైన కప్పుకున్న పండితశాలువా జారుతూ నేలను తాకుతుంది. ఆ సమయంలో ఆయనరూపం విచిత్రంగా ఉంది. అంతలో సన్నగా చీకటిపడింది. వీధిన పోతున్న మా వెనుక కుక్కలు తరమడం మొదలుపెట్టాయి. పరిస్థితి గమనించిన నేను సిగ్గుతో ప్రక్కకు తప్పుకున్నాను. ఆయన కుక్కలను తిడుతూ పరుగుపెడుతుంటే దారిన పోయే జనంఅంతా ఆ వింతదృశ్యం చూసి పగలబడి నవ్వుతున్నారు. నాట్యకళామతల్లి పూజ లందుకోవలసిన పరిస్థితినుండి ఆయన రూపంలో మద్యంసేవించి కుక్కలు తరుముతుంటే రక్షణకై పరుగులుపెడుతున్న ఆ సన్నివేశంచూసి నాలో నాట్యకళపై ఆశక్తి చచ్చిపోయింది. మరునాడు ఆ గురుదేవునికి చెప్పి ఆనాటితో శెలవు తీసుకొన్నాను.

అని వివరించాడు ఆ విద్యార్థి బాధగా.

అవును ఇలాంటి సంఘటనలు మనం సంఘంలో ఎన్నో చూస్తూనే ఉన్నాం. ఒకనాడు నాట్యగురువుగా శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో గౌరవింపబడి "విద్వత్సభారంజక" బిరుదుతో సత్కరింపబడిన శ్రీరంగరాజు వంటి నాట్యాచార్యులు, కాకతీయ గజ సైన్యాధ్యక్షునిగా భారంవహిస్తూ. నృత్యం అభ్యసించి కత్తి, కవనం రెండూ సమపాళ్ళలో కదిలించి "నృత్తరత్నావళి" వంటి గ్రంథరాజాన్ని ఆంధ్రుల భావితరాలకు అందించిన జాయప సేనానివంటి వీరునికి విద్యనేర్పి, ప్రోత్సహించిన సద్గురువు శ్రీ గుండయామాత్యునివంటి వారెందరో చరిత్రలో వున్నారు ఆనాడు. వారికివారసులుగా ఈనాడు శ్రీ నటరాజరామకృష్ణ, శ్రీ వెంపటి చినసత్యం వంటి సద్గురువులు ఎందరోవున్నారు. నృత్యకళారాధనకోసం తమ జీవితాలను అర్పించి తమవంతు సేవజేస్తూ, ఎందరికో విద్యనేర్పి ఆ విద్యద్వారా దేశ సంస్కృతిని లోకానికి చాటి, నృత్యకళలో మన ఆంధ్రులను మించినవారు లేరని కీర్తిపతాకాన్ని ప్రపంచమంతటా తమ శిష్యులద్వారా ఎగురవేస్తున్న ఈ రోజులలోకూడా నాట్యాచార్యునిగా సంఘంలో తిరగాలంటే సిగ్గుగా ఉంటోంది. దీనికి, అంటే ఈ పరిస్థితికి కారణం ఎవరు?

నృత్య విద్యను అడ్డుపెట్టుకొని కాలం వెళ్ళదీస్తూ, తమ అవసరాలు తీర్చుకొనే నాట్యాచార్యులు, వారుచేసే వికృతచేష్టలు కారణం. అలాటి గురువులు మారాలి. మారినప్పుడే మంచి గురువులుగా నిలచినప్పుడే, విద్యను పంచినప్పుడే, గురుశబ్దం మరలా ఉన్నతశిఖరాలు అధిరోహిస్తుంది.

శిష్యులుకూడా గురువును ఎంచుకొని విద్య నభ్యశించాలి.

నీటిని వడపోసి తాగు.

గురువును పరీక్షించి విద్య నేర్చుకో అన్నారు పెద్దలు,

లోకంలో గురువులు అనేకమంది ఉండవచ్చును. కానీ వారిలో సద్గురువులు కొందరే వారిని అన్వేషించి విద్యనేర్చుకొన్న విద్యార్థిమాత్రమే విద్యాలోకానికి మార్గదర్శకుడవుతాడు. విద్యాభ్యాసం చేసే సమయంలో గురుదేరుని ఆగ్రహానుగ్రహాలు అనేకరకాలుగా ఉంటాయి.

ఒకసారి ప్రచండమయిన అగ్నిజ్వాలలా భరించరాని వేడిని గల్గించినా, మరోసారి పౌర్ణమిరేయినాటి సంపూర్ణ చంద్రుని శీతలకిరణాలవలే చల్లగా హాయిని కల్గిస్తాయి. మరోసారి సుగంధ పరిమళ భరితమయిన పుష్పాలగుండా వీచిన చల్లగాలిలా అహ్లాదం కల్గిస్తాడు.

అందుకే కబీరుదాసు వంటి మహాకవి ఇలా అన్నాడు.

నిజమైన గురువు నిజవీర శూరుడు.
సమూలముగా శిష్యమతిని గాల్చు.

బాహ్యమునకు గాయము గనుపించదు.

తొంగిచూడలోన తొ్ట్ర మిగులును.

విద్యాబోధన అనెడి విల్లు ఎక్కుపెట్టిన గురువు శాస్త్రప్రవచనం అనే బాణాలతో యుక్తిగా, సూటిగా శిష్యుని మస్తిష్కంలో పేర్కొన అజ్ఞానంపై కొడతాడు. ఆ బాణం యొక్క ధాటికి అజ్ఞానం అంతమొంది ఆ స్థానంలో విజ్ఞానం పెంపొందుతుంది. అందుకే ఈలోకంలో గురువును దైవంగా భావించి బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపునిగా కీర్తించారు పూర్వులు.

విద్యలో తిరుగులేనివానిగా తీర్చిదిద్ది, ఆ శిష్యునిద్వారా తనలోని విద్య, ఆ విద్య యొక్క విశిష్టత లోకానికి తెలిపి, దాన్ని గ్రహించిన శిష్యుని, గురువునూ లోకం కీర్తించి నప్పుడు గురువుపొందే ఆనందం వర్ణనలకు అతీతం.

తన విద్యద్వారా శిష్యుడు గౌరవించబడినప్పుడు పొందే ఆనందమే అవ్యక్తానందంగా గురువుకు మనశ్శాంతినిస్తుంది.

అందుకే —

చిరంజీవులారా ! సద్గురువును ఎన్నుకొని, ఆ గురువుయొక్క మనస్సును గ్రహించి, విద్యనభ్యసించి, ఆ గురుదేవుని విద్యను లోకంలో ప్రచారంచేసి, గురువుకు, గురువునుకన్న దేశానికి, మీకూ, మిమ్మల్నిగన్న తల్లి దండ్రులకూ, మిమ్మల్నిగన్న భూమికి పేరుతేవాలి.

ఆనాడే నిజమైన గురుసేవ మీరుచేసినట్లుగా మీ గురుదేవుడు భావిస్తాడు.

అలా భావించినవాడే నిజమైన గురువు.

కాదు త్రిమూర్తి స్వరూపుడు.

# తప్పొప్పుల పట్టిక

| పాఠము | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ప్రకృతి-కళ | 1 | 31 | విషి | విశి |
| ఆంధ్రులు | 1 | 4 | కశ్చి | ఖశ్చి |
| చాళుక్యుల కళావిశిష్టత | 1 | 3 | నిద్యా | విద్యా |
| ,, | 1 | 9 | చోడన్న | చోడనృ |
| కాకతీయుల కళావికాశం | 1 | 9 | పాభాల | పాఖాల |
| ,, | 3 | 14 | మాచత దేవి | మాచల్ దేవి |
| ,, | 3 | 19 | రర్నావళి | రత్నావళి |
| రెడ్డిరాజుల కళాతృష్ణ | 1 | 30 | పోకటలు | పోకడలు |
| విజయనగర నాట్యవిన్యాసాలు | 3 | 11 | గగనమహిత | గగనమహల్ |
| నాయకరాజుల నాట్యపిపాస | 3 | 11 | చేపదకేళి | చాపదకేళి |
| నవాబుల నాట్యపోషణ | 1 | 26 | తత్వజ్ఞుని | తత్వజ్ఞాని |
| సంస్థానాధీశుల కళాపోషణ | 1 | 4 | పెద్ద వర్గాలు | పెద్ద వర్ణాలు |
| ,, | 1 | 11 | పెద్దవర్గములుగా | పెద్దవర్ణములుగా |
| దేవాలయ ఆరాధనా నృత్యాలు | 1 | 10 | వీరుల కొలువులో | వీరుల కొలుపులో |
| ఆస్థాన నర్తకి | 1 | 22 | దేవతాసి | దేవదాసి |
| అష్టదిక్పాలకుల ఆరాధన | 1 | 1 | ప్వామివారి | స్వామివారి |
| అగ్నిదేవారాధనం | 1 | 4 | నాటిరాగం | నాటరాగం |
| వరుణారాధనం | 1 | 4 | శద్ధావత | శ్రద్ధావతి |
| భామాకలాపం | 3 | 8 | నిలువు అద్దంలో | నిలువుటద్దంలో |
| ,, | 3 | 23 | నవజనార్ధం | నవజనార్ధనం |
| ఆంధ్రనాట్యం | 1 | 19 | ఖరిచ్చితమయిన | ఖశ్చితమయిన |
| ,, | 4 | 2 | భారామతి | తారామతి |
| పేరిణిశివతాండవం | 3 | 10 | ప్రేరిణి | ప్రేరణ |
| ,, | 3 | 17 | విషయం | విషమం |
| ,, | 3 | 23 | ఆఫత్ లింగం | జంబుకేశ్వరస్వామి |
| ,, | 3 | 24 | తేజోలింగం తిరువణ్ణామలై | ఈశ్వరస్వామి |
| ,, | 4 | 1 | పంచాంగమూర్తులు | పంచలింగమూర్తులు |
| ,, | 4 | 3 | పురుషుని | పురుషుడు |
| గురు శిష్యుల అనుబంధం | 6 | 4 | పేర్కొన | పేర్కొనిన |

# చివరిగా చిన్నమాట

నేను రచించిన ఈ "ఆంధ్రులు - నృత్యకళ" అనే నాట్యశాస్త్ర గ్రంథం చదివారుగదూ !

ఒక మిత్రుడన్నాడు ఎందుకు ప్రసాద్ ఈ గ్రంథ రచనలు - ముద్రించడాలు ఆ డబ్బు అంతా గోడకు వేసిన సున్నమేగదా, దానివలన ఫలితం ఏముంది, అటు ప్రభుత్వానికా నిన్ను గుర్తించే తీరిక లేదు. ఇటు ప్రజలకా నీ గ్రంథాన్ని గూర్చి ఆలోచించే వ్యవధిలేదు. మరెందుకిలా రాత్రనకా, పగలనకా నాట్యం, నాట్యకళాప్రచారం అంటూ ప్రాకులాడుతూ సమయాన్ని, శ్రమనూ, ధనాన్నికూడా వృధాచేస్తున్నావు అని.

అది ఒక రకంగా నిజమే అన్పించింది. ఎందుకో తెలుసా నేను రచించిన తొలి నాట్యశాస్త్రగ్రంథం "సిరిమువ్వలు" అది నా శిష్యురాలయిన శ్రీమతి శారదారామకృష్ణ సహకారంతో ముద్రితమయింది. నా కృషిని, నా గ్రంథాన్ని ఎందరో మెచ్చుకున్నారు. ఆ గ్రంథాన్ని ప్రతి పాఠశాలలో పాఠ్యగ్రంథంగా ప్రవేశపెట్టాలని అన్నారు. ఓ పత్రికవారా గ్రంథాన్ని సీరియల్‌గా ముద్రించారు గూడా.

కానీ -

ప్రభుత్వంనుండి గానీ, సాంస్కృతిక సంస్థలచాటున వేదికలెక్కి కళనుద్ధరిస్తున్నామని చెప్పే పెద్దలనుండి గానీ ఏ రకమయినా ప్రోత్సాహం లభించలేదు. సుమారు 20 వేల రూపాయల ఖర్చుతో ముద్రించిన ఆ గ్రంథప్రతులు చాలావరకూ మా నృత్యనికేతన్‌లోనే అలానే ఉన్నాయి.

నాట్యశాస్త్రం, శిల్పశాస్త్రం మేళవించి ఒక ప్రణయగాదను " అమర వసంతం" అనే నవల వ్రాశాను. విజయనగర సామ్రాజ్యంలో జరిగిన ఒక నర్తకి కథను " పుష్పాంజలి " అనే పేరున చారిత్రక నవల రచించాను. ఈ "ఆంధ్రులు-నృత్యకళ" రచించి రెండు వసంతాలు నిండింది, ఇవేవి వెలుగును చూడలేదు. వెలుగు చూపాలని నేనుచేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఇక విసిగిపోయిన నేను రచనలు చేయటం విరమించాను. కానీ, నాలోని కళను పదిమందికి అందించాలనే తపన అణచుకోలేకపోతున్నాను. ప్రభుత్వం గుర్తించకున్నా, కళాసంస్థలు ప్రోత్సహించకున్నా పదిమందికి నా గ్రంథం ఉపయోగపడితేచాలు అనుకున్నాను నా గ్రంథంద్వారా నాట్యకళ ప్రచారం అయితేచాలు అనుకున్నాను. కానీ ఎలా ?

అంతలో -

ఏదో మాటల సందర్భంలో ఈ విషయాల్ని తెలుసుకొన్న మిత్రులు సహృదయులు శ్రీ మేడపాటి సీతారామరెడ్డిగారు, నేనున్నాను మాస్టారూ మీ తపన, కళా విశిష్టత లోకానికి తెలియాలి. అంటూ ముందుకొచ్చి ఈ గ్రంథానికి వెలుగును చూపారు.

అందుకే శ్రీ మేడపాటి సీతారామరెడ్డి, సుశీలదేవి దంపతులకు మనఃపూర్వకముగా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

ఈ గ్రంథరచనకు నా నాట్యశాస్త్ర పరిజ్ఞానము, అనుభవమే గాక భరతుని "నాట్యశాస్త్రం", నందికేశ్వరుని "అభినయదర్పణం" శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారి "ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర" శ్రీ నటరాజ రామకృష్ణగారి "దక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర" తదితర ఇంకా ఎన్నో గ్రంథాలు. నాకీ గ్రంథ రచనలో తమవంతు సహాయం అందించాయి. అందుకే వారందరికీ పేరుపేరునా నమోవాకాలు.

ఇక తొలిపలుకులు అందించిన నా మిత్రులు తెలుగు విశ్వవిద్యాలయ కులపతి శ్రీ బేతవోలు రామబ్రహ్మంగార్కి, గ్రంథాన్ని అందంగా ముద్రించిన బాక్సుప్రెస్ అధినేత శ్రీ బొలిశెట్టి రామచంద్రరావుగార్కి, వ్యాసాలకు తగిన బొమ్మలు చిత్రించడంలో నాకు తోడ్పడిన నా సోదరుడు మోహన్‌కుమార్‌కు నన్ను తొలినుండి ప్రోత్సహిస్తూ తమ అండదండలు అందిస్తున్న నా శిష్యుల తల్లి దండ్రులకు కృతజ్ఞతాంజలి.

ఈ గ్రంథం చదివిన మీరు పెద్దలయితే మీ విలువయిన సలహాను, ఆశీర్వాదాన్ని, చిన్నలయితే అభిప్రాయాన్ని లేఖద్వారా అభిమానంతో నాకు తెలియజేయమని కోరుతూ -

ఎన్ని జన్మలెత్తినా ఈ ఆంధ్రమాత ఒడిలోనే కళల నిలయమయిన చల్లని గోదావరి తీరంలోనే జన్మించే అవకాశం కల్పించమని భగవంతుని ప్రార్థిస్తూ -

నేను మళ్ళీ జన్మించే నాటికయినా ఆంధ్రావనిలో ప్రతియింట ఒక నాట్యకళాకారుడు, ఒక సంగీత విద్వాంసుడు ఉండేలా అనుగ్రహించమని ఆ గిరిజానటరాజస్వామిని ముకుళిత హస్తాలతో ప్రార్థిస్తూ -

ప్రస్తుతానికి మీ వద్ద శెలవు తీసుకొంటున్న

మీ

సప్పా దుర్గాప్రసాద్.